JAGATI Rs. 2-00 Aug. 1985

30th Year of Publication




## ఆగస్టు 1985




'ఎవరెవరు?'

'జర్మన్ ట్రిబ్యూన్స్' సౌజన్యంతో

'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600004
ఫోన్: 76697 - సం॥ చందా రు. 20-00, 2 సం॥లకు రు. 38-00, 5 సం॥లకు రు. 85-00. జీవిత చందా రు. 300-00... విదేశాలకు 2 సం॥లకు రు 85-00

ముఖచిత్రం: జిడ్డు కృష్ణమూర్తి



రామ్మూర్తీ శ్యామ్రావూ తమ జీతాల గురించి మాట్లాడుకుంటున్నారు

"నేను జీతం అందుకోగానే, ఫైవ్ పెర్సెంట్, అంటే అయిదు శాతం - ఇప్పుడు ఎనిమిదివందలు కదా నాకు, అందులో ఇరవయ్యోవంతు అనగా నలభై రూపాయిలు, దేవుని హుండీలో వేసి, మిగతాది మాత్రమే ఖర్చు చేస్తాను" అన్నాడు దైవభక్తిగల రామ్మూర్తి.

"నేను జీతమంతా ఆయన ముందు పెట్టి, ఆయన తీసుకోగా మిగిలినది ఖర్చు పెడతాన"న్నాడు శ్యామ్రావు

—బి జయదాస్

బుచ్చిరెడ్డిపాళెం

పాలకుండగాని, పాలమనిషిగాని ఎదురు రావడం మంచి శకునమని చెబుతూండేదిమామ్మ్మ -అందిసుగుణ

'పాలల్లో నుంచి వెన్న తీయడం పోయి, పాలల్లో వెన్నకలిపే ఈరోజుల్లో పాల పంచులేగాని పాలకుండలెక్కడే, తల్లీ?'–అని దీర్ఘం తీసింది సుభద్ర.

—అర్ ప్రభాకరరావు

మద్రాసు-17

అర్ధనారీశ్వరుడైన శివుడు, గంగని నెత్తిమీద ఎందుకు పెట్టుకున్నాడంటాడ్ ? - అని సాలోచనగా అడిగాడు శంకరం.

"అ, ఏముంది, 'తెలుగు గంగ'లా ఎవరైనా పట్టుకుపోతారేమోనని" అని చిటికలో తేల్చాడు చిదానందం

— తలుపులు

పెద్దాపురం

చికటో తేదీన బార్కెళ్లి ఖుషీగా వచ్చిన భర్తను, తిట్టవలసిన తిట్లన్నీ తిట్టి, చివరి మాటగా అంది భార్య: "పక్కింటి పరంధామయ్యగారిని చూడరాదూ, ఎలా ఎగిరి ఇంట్లోకి వచ్చి వాల్తాడో! మీరూ వున్నారు, ఎందుకూ?"

"నేను వాళ్లింట్లో వాలితే, వాళ్లావిడ వూరుకోదేమో!"

— కె నరసింహారెడ్డి

మాచర్ల

టెలిఫోన్ తీగెలు అంత ఎత్తున వేస్తారెందుకో చెప్పరా, సురేష్?– అని ప్రశ్నించాడు టీచరు

ఆలోచించాడు సురేష్

'కమాన్, నువ్వు చెప్పు'

"దారినపోయేవారికి మాటలు వినిపించకుండా వుండేందుకు, సార్"

—ఎయస్ ఇందిర

బెంగుళూర్లు

ధీరునిలా ముఖంపెట్టి, ఉత్సాహంగా వున్న రాజకీయ నాయకునితో పత్రికా విలేఖరి అన్నాడు: "మీ మీటింగు యింత ప్రశాంతంగా ఏ అల్లర్లూ లేకుండా జరగడానికి ఏదో కారణం వుండాలి."

"చెప్పమంటారా, మీ దగ్గిర దాపరికమెందుకు, చెబుతాను. ఊళ్లోవున్న టొమాటోలూ, కోడిగుడ్లూ మొత్తంగా టోకున కొనిపించేశాను."

—పి వైజయంతి

చిత్తూరు

ఇదేమిటోయ్ రెండు పార్టీల జండాలూ కట్టేశావేమిటి?-అని అడిగాడు సుబ్బయ్య, రిక్షా అబ్బాయిని.

"ఏం చేయమంటారు, బాబూ-ఒకరి జండా పెడితే మరొక పార్టీవాళ్లు పీకేస్తున్నారు. రెండూ వున్నాయి గనక వాళ్లూ వాళ్లూ తేల్చుకుంటారు-నా దగ్గరికి రారు."

—యస్ రవి

తిరుపతి

బ్యాంక్ కాలనీలో ఉంటున్నారు సరళ, సోమశేఖరం. అందరివీ ఒకేమాదిరి యిళ్లు.

"ఏమండీ, మన టామీ (కుక్క) మనింట్లో సుష్టుగా తిని, పక్కవాళ్లింటి ముందు పడుకుంటుంది"-అని చెప్పుకుంది సరళ, సోమశేఖరంతో.

"ఒక పని చెయ్ - పక్కవాళ్లింటికి తీసుకెళ్లి అన్నం పెట్టు – మనింటి ముందు పడుకుంటుంది"- అని సలహా యిచ్చాడు సోమశేఖరం.

—కె రామకృష్ణ

రేపల్లె

నా పాట ఎలా వుందండీ? - అని అడిగాడు గాయకుడు.

"ఓ, అద్భుతం - మీరు మంగళం పాడుతున్నప్పుడు నాకు మెళకువ వచ్చింది"

—యస్ రామకోటేశ్వరరావు

వినుకొండ

## పాఠకలేఖలు

ప్రియమిత్రులు శ్రీ చందూర్‌గారికి నమస్కారములు.... నాటి తెలంగాణాలో గ్రంథాలయాల ద్వారా, స్త్రీ విద్యద్వారా, ఇంకా అనేకవిధాల ప్రజలలో చైతన్యాన్ని కలిగించిన ఆంధ్రపితామహులు శ్రీ మాడపాటి హనుమంతరావుగారి (జూన్ నెల 'జగతి' ముఖచిత్రం) శతజయంతి ఈమధ్యే ఇక్కడ వైభవంగా జరిగింది. మద్రాసు, విజయవాడ, తిరుపతి, విశాఖ మొదలైన చోట్ల శతజయంతి జరపాలని ఆ సంఘం వారి కోరిక... 'జగతి' అన్ని మాసపత్రికల వంటిది కాదు. దీనికో ప్రత్యేకత వుంది. ప్రాచీనతను, నవ్యతను, రెంటినీ మీరు ఆదరిస్తున్నారు. ప్రాచీన కావ్యాలలోని పద్యాలు హృద్యాలు. 'ప్రాచీన సాహితి' మా చోంట్లకు ఆకర్షణ, పాతికేళ్లనాటి చిత్రాల సమీక్షలు, పాతసంచికల నుంచి తీసి ప్రచురించడం బాగుంది. 'మానవ ప్రగతి'లో మార్క్‌ట్వేన్‌ను గురించినది ఎంతో ఉపయోగకరం. అతని రచనల అనువాదాలిప్పుడు. రష్యాలో లక్షల సంఖ్యలో అచ్చవుతున్నాయి. మార్క్‌ట్వేన్ గడుసువాడు My writings are Water and those of the great genuises are Wine. But everybody drinks Water. ('నా రచనలు నీళ్లు: మేధావుల రచనలు మధువు. ప్రతివాడూ నీళ్లు త్రాగుతాడు') అన్నాడు ఒకచోట .... 'చిత్రజగతి' మరో గొప్ప ఆకర్షణ, చక్కని నిష్పక్షపాతమైన సమీక్షలు ప్రచురిస్తున్నారు. అలాగే మద్రాసులో జరిగే తెలుగు సాంస్కృతిక కార్యక్రమాలను గురించి 'జగతి' ద్వారానే తెలుసుకుంటున్నాము. ఇంకా ఎన్ని ఆకర్షణలో! వినోద విజ్ఞానాలను కలగలిపి ముప్ఫయ్ ఏండ్లుగా పాఠకులకు అందిస్తున్నది 'జగతి'; మూడు దశాబ్దాల నిర్విరామకృషి మీ ఒక్కరిదే.

—దాశరథి

హైదరాబాదు-29

ఆర్యా : మీ సంపాదకత్వాన అతి సుందరంగా, రోజు రోజుకు మూడు పువ్వులు ఆరు కాయలుగా వెలుగొందుతున్న 'జగతి' మాసపత్రికను, మిమ్ములను ప్రశంసించకుండా ఉండలేకపోతున్నాను. ఆంధ్రపితామహ శ్రీ మాడపాటి హనుమంతరావుగారి ముఖచిత్రంతో వెలువడిన సంచికలోని విషయాలు చాలా విజ్ఞానదాయకం.

—వై వెంటయ్య

హైదరాబాదు

# ప్రాచీన సాహితి

సరసులు దాక్షిణాత్య కవిపుంగవులు చెంతలయందు ముందటన్
సురుచిర గీతమున్ వెనుక శోభిత చామర పాణి మానినీ
కరమణి కంకణ క్వణము గల్గినయేని భవానుభూతిచే
బరగుము గల్గవేని భవభంజన యోగము బూను మానసా

—భర్తృహరి



గాజుపూసకు నెంత కాంతిరా దోమిన
రమణీయ మగు జాతిరత్న మగునె
గరిమ నిత్తడి వహ్ని గరగి వర్ణము బెట్ట
వసుధపై విమలసువర్ణ మగునె
గార్దభంబును వేయుగతుల దాటించిన
నోజతో సామ్రాణితేజి యగునె
ప్రేమ బిప్పలితేనె బెట్టి కాకిని బెంప
కుటిలస్వరము మాని కోకిలగునె
కాన గుణహీన బుధజనుల్ క్రమముతోడ
నెలమిబోధింప సద్గుణం బేల గల్గు
ప్రణుతధవళాంగ మౌనిహృత్పద్మభృంగ
అమిత భవభంగ శ్రీ కాళహస్తిలింగ

—కాళహస్తిలింగశతకం



ఆ విప్రోత్తమ వజ్రపంజర నిభంబై నిశ్చలంబైన న
ద్భావం బంగన సాహచర్య గుణ సంపర్కంబునన్ లోహమై
గ్రావంబై దృఢదారువై తరుణవృక్షంబై ఫలప్రాయమై
పూవై తన్మకరందమై కరగె బో బో వీళ్లకున్ బల్చనై

సారంగు తమ్మయ్య 'విప్రనారాయణ'

# పాతికేళ్లనాటి పిక్చర్

## పద్మినీ వారి 'పిల్లల రాజ్యం'

ప్రజారాజ్యం, నిరంకుశత్వం, ధనికుల దోపిడీ, ఆకలి మంటలు, సమానత్వం మొదలైన పెద్దమాటలు పిల్లల చేత పలికింపజేసి, మేము చూపే ఈ చిత్రం 'పిల్లలు తెచ్చిన చల్లని రాజ్యం' సుమండీ - అంటున్నారు నిర్మాతలు. ఇందులో పిల్లలు పిల్లలుగారు. అర్థశాస్త్రం, రాజనీతితోబాటు ఒకసారి చంద్రమండలం వెళ్లి, అక్కడ అంకణం ఏలెక్కని అమ్మేదీ ఎవరూ చెప్పకపోగా, నిత్య కన్నెల దీవికి రాణీగారైన సత్య కన్నెను, రాక్ అండ్ రోల్ డాన్సులో ఓడించి, సకలార్థ సాధక చింతామణి తీసుకు వచ్చిన అఖండులు.... అనగా అనగా మాయాపురి అనే ఒక ఊరు వుంది. ఆ ఊరి రాజుగారు 'సమాజాభ్యుదయం' అతిగా కాంక్షించడంతో, మంత్రి మహాసేనునికి (రాజనాల) వొళ్లు మండి, దయాళునితో (రమణారెడ్డి) కుట్రకున్ని, రాజుని అంతమొందించబోతాడు. తుపాకీ మందు ధామ్మని పేలేసరికి, రాజు 'గయా' అనుకుంటాం కాని, వావడు - భార్య గుణవతితో (రాజమ్మ) బాటు, భూమిలో కూరుకు పోవడానికి బదులు, గాలిలోకి ఎగిరి పోతాడట. పోనీ, ఎగిరాడయ్యా - ఆ ఎగిరినవాడు. అలా వుండొచ్చుగా - వుండడు, మామిడిచెట్టు అవుతాడు.... విజయసింహుని (మాస్టర్‌గోపీ) కన్న గుణవతి, కొడుకు, వయసు మర్చి పోకుండా వుండెందుకు, ప్రతి సంక్రాంతికీ జబ్బమీద ఒకవాత పెడుతూవుంటుంది. పదేళ్లు వచ్చేసరికి విజయునికి ఇద్దరు గరల్ ఫ్రెండ్స్ - దయాళుని కూతురు, మంత్రి కూతురు, ఈ పిల్లలందరూ కలిసి, పట్టుబట్టి, చల్లని రాజ్యం పట్టుకొస్తారు.... విజ్ఞాన కోవిదుని పాత్ర ధరించిన శివాజీగణేశన్ చాలా గొప్పగా నటించాడు. 56 దేశాల వనితా సంప్రదాయాలూ, పంచరంగులలో చంద్రలోక చిత్రీకరణా, బాలకృష్ణ హాస్యమూ బావున్నాయి, దర్శక నిర్మాత: బి ఆర్ పంతులు.

—యన్నార్ చందూర్ సమీక్ష

'జగతి'-అగస్టు 1960

* * *

రాష్ట్రపతి సిల్వర్‌మెడల్ పొందిన 'శంభూఫిలిమ్స్' వారి 'నమ్మినబంటు' చిత్రాన్ని సాన్ సెబాస్టియన్‌లో (స్పెయిన్), 1960 జులై 9 నుంచి 19 వరకు జరిగే, ఎనిమిదవ అంతర్జాతీయ చలనచిత్ర పోటీకి భారత ప్రభుత్వం పంపించింది. ప్రప్రథమ తెలుగు చిత్రమిది. మొత్తం పిక్చర్‌ని స్పానిష్ సబ్‌టైటిల్స్‌తో 9500 అడుగులకి కుదించాడు. నిర్మాత: యార్లగడ్డ వెంకన్నచౌదరి. స్పెయిన్ వెళ్తున్న ప్రతినిధివర్గంలో రంగారావు, గుమ్మడి, సరనయ్య మున్నగువారున్నారు.

'జగతి'- అగస్టు 1960

# వెన్నెల కెరటాలు

## శాంతి మండలం

ప్రతిదేశంలోని ప్రజలూ యీనాడు శాంతి ఆవశ్యకతను గుర్తిస్తున్నారు. హిందూ మహాసముద్రాన్ని శాంతి మండలంగా మార్చాలని పలుదేశాలు ముక్తకంఠంతో నినదిస్తున్నాయి; ఈ దేశాలు ఎంతో అత్యవసరంగా తమ ఆర్థిక వ్యవస్థల్ని అభివృద్ధి చేసుకొనవలసి వుంది; ఆకలిని రూపుమాపు కొనవలసివుంది; అణ్వస్త్ర ప్రమాదాన్ని, సైనిక ఒత్తిడులను నిర్మూలించి ప్రశాంత పరిస్థితులు నెలకొనడానికి హామీ కల్పించవలసి ఉంది. అప్పుడే ఆయాదేశాల ప్రజలు తమదేశ పాదార్థిక వనరుల్ని పూర్తిగా, స్వేచ్ఛగా అనుభవించడానికి, దేశ అభ్యున్నతికి వాటిని వినియోగించడానికీ, వీలు కలుగుతుంది .... శాంతి అన్నది ఒక అవాస్తవికమైన వాగ్దానంకాదు, ఒక యథార్థతకు అవకాశం. హిందూమహా సముద్రం శాంతి మండలంగా రూపొందితే, యీ లక్ష్యసాధనదిశలో ఒక పెద్ద ముందంజ కాగలదు.

—జస్టిస్ కృష్ణయ్యర్
'సోవియట్ భూమి' లో

## తేనెటీగల రాణి

తుట్టెకంతటికి రాణిఈగ తల్లివంటిది, ప్రతితేనెతుట్టెకు ఒక్క రాణిఈగ మాత్రమే ఉంటుంది. రాణి ఈగ బాధ్యత గుడ్లు పెట్టడం మాత్రమే. ఆకారంలో ఇతర ఈగలకన్నా ఒకటి న్నరరెట్లు పెద్దసైజు ఉండటం వల్ల తేలికగా గుర్తించవచ్చు. వీటిరెక్కలు శరీరాన్ని పూర్తిగా కప్పలేవు... రాణి ఈగ సామాన్యంగా తేనెతుట్టెనుంచి రెండుసార్లు మాత్రమే బయటకు వస్తుంది. మొదటిసారి మగఈగతో జతకూడేందుకు, రెండవసారి వలస పోయేందుకు, జతకూడటం కోశసదశ నుంచి ఈగగా మారిన 3నుంచి 8రోజు లలోపుగాజరుగుతుంది. రాణిఈగ ఒక సారి ఒకమగఈగతో జతకూడిన పిమ్మట అది మళ్ళీ జతకూడదు. రాణీ ఈగ, మగ ఈగతో జతకూడిన మూడవ రోజునుంచి గుడ్లు పెడుతుంది. ఈ గుడ్లు సన్నని 'కామా' ఆకారంలో తెల్లగా వుంటాయి. రాణి ఈగ నిముషానికి 6 గుడ్లు చొప్పున రోజుకు 7,200 గుడ్లు పెట్టగలుగుతుంది. కాని సామాన్యంగా రోజుకు 2000 నుండి 3000 వరకూ గుడ్లు పెడుతుంది.

—ఎ శ్రీధరరావు
'అన్నదాత' లో

## జైలు రోజులు

1930 లో శాసనోల్లంఘనం చేసి జైళ్ళకు వెళ్లాం. మొదట నాకు ఒక సంవత్సరం కఠిన జైలుశిక్ష వేశారు.

రాజమండ్రి సెంట్రలు జైలు పరిపాలనంతా అవినీతిమయం! నాకిచ్చినది బి క్లాసుకి ఖైదు. ప్రభుత్వానికి రెండుసార్లు అర్జీపెట్టి దానిని 'సి' క్లాసుకి మార్చుకోగలిగాను. జైలు సూపరింటెండెంటు తెల్లవాడు, మిస్టర్ అప్సన్, అతడు బహుకోపిష్టి. నీచ కృత్యాలు చేయడానికి ఏమాత్రం జంకనివాడు. మాకోసం వండబడ్డ అన్నపు రేషన్ ముద్దలు, బోడి, జొన్న అచ్చులు, గంజినీళ్లు మిగిల్చి సూపరింటెండెంటు యింటివద్ద కోళ్లకు, బాతులకు, పందులకు ఆహారంగా జైలు జవానులు తీసుకుపోయేవారు. జైలు కిచన్ పర్యవేక్షకుడుగా 'సి' క్లాసు ఖైదీలు కోరికపైన నేను ఏర్పాటయ్యాను. ఈ చోరీలను నేను అట కాయించి, సూపరింటెండెంటుకు శత్రువునైనాను. నాతో పడలేక నన్ను రాయవెల్లూరు జైలుకు బదిలీచేశాడు.

— టి ప్రకాశరాయడు

'గాంధీక్షేత్రం'లో

## కుందుర్తి

నిజానికి కవి తాను నిర్మించుకున్న కావ్యసౌధానికి తనే గోడలు కట్టుకుంటాడు, అనన్య సాధ్యంగా పెరిగిన ఆదర్శాల సీలికొసల్ని కొనవ్రేళ్లతో ముట్టుకుంటాడు. భూమ్మీద కప్పడిన మంచు సూర్యుడ్ని ఆపలేనట్టుగానే, పుటల్లో కెక్కిన చరిత్ర కాలాన్ని ఆపలేదు. కాలం అనంత ప్రవాహం. ఈ ప్రవాహంలో ప్రజలు నావలు. ప్రవాహంలో ప్రయాణం చేస్తున్న ప్రజలు మార్పు కోరడం సహజం. మార్పు దానంతటదిరాదు. మానవుని ప్రయత్నంవల్ల, నిరంతర కృషివల్ల వస్తుంది. ఉద్యమాల వాన చినుకుల్తో భూమిలోని పచ్చని మార్పు గ్రహిస్తాడు. 'నడుస్తున్న చరిత్రలో ఉద్యమాలు విరజాజులు-ముడుస్తుంది ప్రజావాణి - ప్రాకే పరిమళాలవంటి మార్పుల్ని గ్రహిస్తుంది- కాలం విప్లవ పాణి.... ఉద్యమాలు సృష్టించేవారు ప్రజలనీ, మార్పును కోరేవారూ ప్రజలనీ, ఈ ఉద్యమాల చరిత్ర కొప్పులోని విరజాజుల వంటివనీ, ఆ విరజాజుల పరిమళాలే మార్పులనీ, అదే విప్లవపాణి అనీ చక్కటి భావచిత్రంగా చూపిసారు కుందుర్తి.

కె శ్రీరాములు

'స్రవంతి'లో

---

రచయిత మనసులో వుండి, కలంలో నుంచి కాగితం మీదకు రానంత వరకే అది అతని స్వంత ఆస్తి. ఒక్కసారి కాగితం మీద రూపు దాల్చడంతో, యిక అపాత్ర, రచయితకు చెందదు - యుక్తా యుక్తాలు నిర్ణయించేది పాఠకులవుతారు.

—సోమరెట్ మామ్

---



## సూపర్ కంప్యూటర్

ఈ సూపర్ కంప్యూటర్లు మరింత వేగంగా పనిచేయగలవు మరింత క్లిష్టమైన కార్యాలు సాధించ గలవు. సంక్లిష్ట సాంఘిక, రాజకీయ అంశాలను సైతం వీటిని వినియో గించుకోవచ్చు. పెద్ద అణువులలోని రేణువుల ప్రవర్తన విశ్లేషించగలవు. వాతావరణ సూచనలను మరింత కచ్చితంగా చేయగలవు. క్లిష్టమైన పారిశ్రామిక డిజైన్ సమస్యలను పరిష్కరించగలవు. ఇంకా ఎన్నెన్నో పనులు నడి చేసి పెట్టగలవు. ఇప్పటి కంప్యూటర్ కంటె పది నుంచి నూరు రెట్లు వేగంగా పని చేయగల కంప్యూ టర్ని సూపర్ కంప్యూటర్గా నిర్వ చిస్తున్నారు. కంప్యూటరు వేగం పెరిగే కొలది దాని శక్తి పెరుగు తుంది: దాని సామర్థ్యం ఇనుమ డిస్తుంది. అనంత సమాచారాన్ని అత్యల్ప వ్యవధిలో విశ్లేషించగలదు. సూపర్ కంప్యూటర్లు ఇతర కంప్యూ టర్ల కంటె అదనంగా చేయగలిగిన దేమిటి? ఇప్పటి వాటికంటె ఇవి వేగంగా పని చేయగలవు. గనుకనూ, అనంత సమాచారాన్ని స్వల్ప కాలంలో అందివ్వగలవు. గనుకనూ సూపర్ కంప్యూటర్ల ద్వారా లభించే వాతావరణ హెచ్చరికలు కచ్చితంగా నమ్మకంగా ఉండగలవు. వాతావరణ పరిస్థితులను, గత వాతావరణ ధోరణులను, శ్వాటోపరణం తాలూకు వాయు తరంగాలను (ఏర్ కరెంట్స్) సమన్వయపరచి, విశ్లేషించటంలో సూపర్ కంప్యూటర్లు అద్భుతంగా పని చేయగలవు. ఇప్పటి కంప్యూటర్లు వేగంగా పనిచేస్తున్నప్పటికీ, శాస్త్రజ్ఞులు ఆశిస్తున్నంత వేగంగా అవి సమా చారాలను అందివ్వలేక పోతున్నాయి.

## 'డక్ స్టాంప్'

సుప్రసిద్ధ వన్యజీవ సంరక్షణ ఉద్యమనేత డాక్టర్ సలీమ్ అలీ (బొంబాయి నేచురల్ హిస్టరీ సొసైటీ అధ్యక్షులు): భారత ప్రభుత్వ అటవీ. వన్యజీవ సంరక్షణ శాఖలో వన్యజీవ సంక్షేమ విభాగం జాయింట్ సెక్రటరి సమర్‌సింగ్; ఢిల్లీలోని అమెరికా రాయ బార కార్యాలయంలో సైన్స్ స్పెష లిస్ట్గా ఉన్న వి వి నందా. ఈ

ముగ్గురూ అమెరికా మత్స్య, వన్యజీవ సంరక్షణ సేవాసంస్థ "డక్‌స్టాంప్" పతకాలు అందుకున్నారు. ...........
ఈ పతకాలను ఆ సంస్థ అధ్యక్షులు డేవిడ్ ఫెర్గూసన్ స్వయంగా బహూకరించారు. ప్రపంచ వన్యజీవ రక్షణ వ్యూహం తాలూకు అంతర్జాతీయ ఒప్పందాలను తు. చ. పాటించిన దేశాలు రెండేరెండు ఉన్నాయి. వాటిలో ఇండియా ఒకటి అని అమెరికా రాయబారి ఈ సందర్భంగా ప్రశంసించారు.

## ఫెస్టివల్

ప్రధాని రాజీవ్‌గాంధీ జూన్‌నెలలో అమెరికాలో ప్రారంభించబోయే భారతీయ సాంస్కృతికోత్సవాలను ఎంత లేదన్నా 15 కోట్లమంది అమెరికన్లు దేశం అంతటా తిలకిస్తారు. సంవత్సరంన్నరపాటు జరిగే ఈ సాంస్కృతికోత్సవాలలో భారతదేశానికి సంబంధించిన ప్రతి ఒక్క అంశాన్ని చూపుతారు. భారత సంగీత, నృత్య కార్యక్రమాలను ఏర్పాటు చేస్తున్నారు. సినిమాలు చూపుతారు. భారతీయ కళావైభవాన్ని గురించిన వ్యాఖ్యలు వెలువడుతుంటాయి. సుసంపన్నమగు భారత సంస్కృతీ వారసత్వాలను ప్రదర్శిస్తారు. జూన్13న సుప్రసిద్ధమైన కెనెడి సెంటర్ (వాషింగ్టన్ నగరంలో) లో రవిశంకర్, అలీ అక్బర్‌ఖాన్ జాకీర్‌హుసెన్ వంటి ప్రఖ్యాత భారతీయ విద్వాంసుల కచ్చేరీలతో ఈ ఉత్సవాలు ప్రారంభమవుతాయి. అయితే, నిజానికి వాషింగ్టన్ నగరంలోని నేషనల్ ఆర్ట్ గ్యాలరీలు మేనెల 3వ తేదీనుంచే ఒక బృహత్ ప్రదర్శనశాల ఏర్పాటు జరిగింది. క్రీ. పూ. 3000 నుంచి క్రీస్తుశకం 1300 సంవత్సరం మధ్యకాలపునాటి భారతీయ శిల్పకళాఖండాలను ఈ ఎగ్జిబిషన్‌లో ప్రదర్శిస్తున్నారు. ఈ ఎగ్జిబిషన్‌లో చూపుతున్న కళాఖండాలను ఇండియా అంతటాగల 30 మ్యూజియముల నుంచి, తదితర సంస్థలనుంచీ, ప్రయివేటు సేకరణల నుంచి అరువు తెచ్చారు. వీటిలో మృణ్మయ శిల్పాలు, సింధు నాగరికత నాటి ముద్రికలు మొదలుకొని చోళకాంస్య ప్రతిమల దాకా ఎన్నెన్నో ఆకర్షణలు వీటిలో ఉన్నాయి. భారతీయ చిత్రలేఖనం, శిల్ప కళాఖండాలను అయిదు అమెరికన్ నగరాలలో అయిదు పెద్ద పెద్ద కళాఖండ ప్రదర్శనలు ఏర్పాటు చేయాలని ఈ ఉత్సవ నిర్వాహకుల సంకల్పం. వీటి అన్నిటిలోకి, న్యూయార్కు, మెట్రొపాలిటన్ మ్యూజియంలో ఇండియా అన్న పేరిట ఏర్పాటు వేయనున్న ఎగ్జిబిషన్ అత్యంత ప్రతిష్ఠాకరమైనదిగా ఉండబోతుంది. ఈయేడు అక్టోబరు నెలనుంచి 1986 జనవరి నెలవరకు ఈ ప్రదర్శనం అక్కడ ఉంటుంది. 14వ శతాబ్ది మొదలు 19వ శతాబ్ది మధ్య కాలంనాటి ముగలాయి చిత్రలేఖనాలు, రాజస్థానీ, పహాడీ చిత్రకళాఖండాలు దీనిలో చూపుతారు. ఒక ప్రదర్శనంలో

## కొత్త పుస్తకాలు

"స్ఫులింగాలు - తుషారాలు" (ముక్తకాలు) ... రచన: బెజవాడ గోపాలరెడ్డి; పరిశీలన: డాక్టర్ అమరేంద్ర. ప్రచురణ: ఆంధ్రసారస్వత పరిషత్తు, తిలక్‌రోడ్డు, హైదరాబాదు-1; వెల: రు 8-00.

నిశితదృష్టిగల కవికి వస్తుప్రకృతి సౌందర్యంలో ఎంత లభిస్తుందో మానవ ప్రకృతి పరిశీలనలో కూడా అంతా లభించే అవకాశం వుంది. బెజవాడ గోపాలరెడ్డిగారు యీ రెండు అంశాలనూ తమ కవితల్లో వినూత్న భావాలతో వ్యక్తీకరించారు.

'సప్తతి దాటిన తరువాత స్వతంత్ర రచనకు పుపక్రమించిన' (డా. అమరేంద్ర - 'అనుశీలన'లో) గోపాలరెడ్డిగారిలోని సృజనాత్మక శక్తిని గమనిస్తుంటే, కృష్ణశాస్త్రిగారి కవిత చిన్నదొకటి గుర్తుకు రాకమానదు.

"శిశిరానికి చోటీయకు చోటీయకు, మది లోపలి పూలకారును ఏనాటికి పోనీయకు."

ఈ కవితా సంపుటిలో (118 పేజీలు) 'స్ఫులింగాలు' శీర్షిక క్రింద 220 ముక్తకాలు, 'తుషారాలు' శీర్షిక క్రింద 221 ముక్తకాలు వున్నాయి.

ఈ ముక్తకాల్లో చిన్నవీ పెద్దవీ అన్నీ వున్నాయి. ఎందుకంటే కవి దృష్టిలో "కుదించి చెప్పితే ఒక అందం కవితకు, వర్ణనలతో వివరించి చెప్పితే మరొక అందం, బాలచంద్రునిలో ఒక అందం. దశమి చంద్రునిలో మరొక అందం."

కొన్ని కొన్ని ముక్తకాలు చిన్న చిన్న మాటలలో గంభీరమైన అర్థాన్ని యిస్తూ వున్నాయి.

"నా పల్లవి, అమె చరణాలు; నా గేయము, అమె లాస్యము; నా సూత్రాలు అమె భాష్యాలు; విజయ విజయా సారధివలె కృష్ణ సత్యభామల వలె పరస్పర ఆశ్రితాలే."

దీర్ఘంగా వుండి మనోజ్ఞమైన భావాలను వెలిబుచ్చే ముక్తకాలూ కొన్ని "సహస్ర శ్రద్ధలతో అనురాగాలతో నన్ను సమర్పించుకొనుచున్నా నీవు అనురక్తవు కాకపోయినా, నేను నిరాశుడను కాలేను, మదిరము మిగిలి యున్నది, నీ నా మధ్య యిచ్చి పుచ్చుకోవడాలు యింకా చాలా మిగిలి వున్నవి"

నవ్యనూతనమైన 'యిమేజెస్' హఠాత్తుగ సాక్షాత్కరిస్తాయి కవితల్లో అక్కడక్కడా. ఉదాహరణకి -

'రాత్రి తిమిరాలలో, తారా జప మాలతో దినము ప్రార్థించుచున్నది, సూర్య [illegible] కొరకై!'

కవిత్వానికి ప్రధానంగా కావలసినది గాఢమైన భావావేశం. అది కవిని నిలువనీయదు. ఉక్కిరి బిక్కిరి చేసి శబ్దాలు సమకూర్చుకొని వేగంతో కవి హృదయం నుండి బయట పడుతుంది. ఈ ముక్తకంలో అది స్పష్టంగా విశద మవుతుంది.

'మండే గుండె నిచ్చావు
వేడి నిట్టూర్పుల నిచ్చావు
నీరు కారే కన్నుల నిచ్చావు
నెత్తురు కార్చే వాటిని యియ్యలేక
పోతివే.'

ప్రకృతి పులకింతలకు కవితల కైసేతలు - యివి.

'వాన గిలిగింతలకు ఏరు గగుర్పాటు చెందింది, ఎల్లప్రాయపు పొంగుల విలాసాల చూపింది, గట్టుల చెట్లతో సరసాలాడింది, చిన్న అలలతో కను సైగలు చేసింది.

నవ్వు నురగలలో కూనురాగాలు తీసింది.'

బ్రతుకు సముద్రాన్ని తరచి చూసి నిత్య సత్యాలయిన రత్నాలను ఏరు కొచ్చి కూర్చి సమర్పిస్తున్నారు కవి.

ఇంద్రధనుస్సులూ, దిపావళి మతాబులూ, మబ్బుల మెరుపులు, రాజకీయ అంతస్థులు, వెల్లువ నీటి బుడగలు క్షణ ప్రభలని మరచి తాము శాశ్వతమనుకుంటాయి. 'లక్ష్మి' వంటి రిగా రాదనీ, చపల, చంచల అనే సఖులలో గర్వం, యీర్ష్య, దుష్ట సహవాసాలనే వ్యసనాలను తోడుగా తీసుకొస్తుందనీ చెప్పుతుంది ఒక ముక్తక తుషారం.

మూగ వేదనకు మాటలు నేర్పి పలికించారు కవి.

'మెదడు బరువై యున్నది
దుఃఖాలు మూగుచున్నవి
కలలు మేల్కొను చున్నవి'.

చేదు వాస్తవికత, చాలీ చాలని జీవితాలు యీడుస్తున్న దీన మానవులు కూడా కవిదృష్టిని దాటిపోలేదు.

"బ్రతుకు ఏమిటి, బీదవాని మాసినబట్ట కొరతల అతుకులు, అను దినము.

కుట్టుచునే వున్నారు" అనే ఆవేదన వెల్లడవుతుంది యీ ముక్తకంలో.

చివరగా తమ జీవన సందేశాన్ని యిట్లా వినిపిస్తున్నారు.

'హృదయాన్ని భూరి ఆకర్షణ శక్తికిలోనై క్రింద పడనీయరాదు, శూన్యములో ఎగిరి పోనీయరాదు'

'నీ కష్టాలలో ప్రపంచమంతా జాలి చూపాలని ఆరడించాలని కోరుతావు. ప్రపంచానికి అంత హృదయ కోమలత్వము లేదు, నీ కష్టాల కొలనులో నీవే మునిగి తేలాలె!'

ప్రతి ముక్తకమూ భావవ్యక్తీకరణలో దేనికదే స్వతంత్రమూ, సంపూర్ణ మూగా వున్నా, అన్నింటిలోనూ అనుస్యూతంగా పువ్వులలో దారంలా కనబడీ కనబడకుండా ద్యోతక

మవుతూ వుంటుంది కవి వ్యక్తిత్వం.

విశ్లేషణాత్మకంగా వుంటూనే పఠితలలోని రసజ్ఞతకు మేలుకొలుపు పాడుతూ, కవితా రసాస్వాదనకు దారి చూపుతూ సాగింది. అమరేంద్ర 'అనుభూతి'.

—సరోజిని ప్రేమ్‌చంద్

కాంతితోరణాలు. రచన: మల్లాది సుబ్బమ్మ; ప్రచురణ: ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రయివేట్) లిమిటెడ్, హైదరాబాదు - 500 028; కాపీలకు: విలాసం, 8, ఎం ఐ జి హెచ్ కాలనీ, మెహిదీపట్నం, హైదరాబాద్ - 500028; వెల: రు 15-00.

ఆధునిక సమాజంలో కనబడే ఎన్నో సమస్యలు యీ నవలలో చోటు చేసుకున్నాయి. ఒంటరిగా వుద్యోగం చేసుకుంటున్న ఆడపిల్లలు పడే బాధలు, వివాహాలు, సంబంధాలు, హిందూముస్లింల అనఖ్యత, స్త్రీలలో అవిద్య, మూఢాచారం, ఆచార్య వాదులు ఎదుర్కొనే అవరోధాలు - యింకా ఎన్నో! రచయిత్రి లక్ష్యం యీ సమస్యలన్నింటినీ పాఠకుల ఎదుట పెట్టడమే అవుతే అది సాధించి నట్లే!

ప్రధానపాత్ర దుర్గ, మోహన్‌ని ప్రేమిస్తుంది. అతనివల్ల గర్భవతి కూడా అవుతుంది. అయినా వివాహ వ్యవస్థ మీద విశ్వాసం లేకపోవడం వల్లా, మోహన్ జీవితలక్ష్యం వేరు, అని నిర్ణయించుకోవడం వల్లా అతనిని పెళ్ళి చేసుకోదు. ఒక కూతురిని కని సమాజసేవకే తన జీవితం వినియోగించాలని నిర్ణయించుకుంటుంది. ఉద్యోగం పోగొట్టుకున్న దుర్గ ఆర్థికపరిస్థితి ఏమిటి, సమాజసేవ చేయడం తప్ప సాహసులైన స్త్రీలకు వుద్యోగం చేసుకొని జీవించ గలిగే అవకాశం లేదా అనే ప్రశ్నలు పాఠకులకు కలుగుతాయి.

కొన్ని నిశ్చితమైన విశ్వాసాలతో, ఒక ధ్యేయంతో, ఒక సిద్ధాంతం నిరూపించడానికి రచన చేసినప్పుడు పాత్రలు, వాటి సహజత్వంతో ప్రవర్తించక రచయిత యిష్టానుసారం ప్రవర్తిస్తాయి. ఫెమినిస్టులు యీ పొరబాటు చేయడంవల్ల వుద్యమమే తప్పుదారిన పడవచ్చు. స్త్రీ జీవితం ఆర్థిక సూత్రాలతో ఎంత సంక్లిష్టంగా పెనవేసుకొని వున్నదో చూపడం ఆమె అభ్యుదయానికి కాంతి కవాటం కాగలదు.

—కల్పనాదేవి

కొన్ని పరిస్థితుల నుంచి ఉద్భవమందుతుంది కథ. ఆ ప్రాథమిక పరిస్థితులకు హేతువుతో నిమిత్తంలేదు కాని, ఉద్భవమందిన మరుక్షణం నుంచీ కార్యకారణ బంధానికి కట్టుబడి నడవాలి ప్రతి ఘట్టమూ.

—సోమర్సెట్ మామ్

# ఇది విన్నారా?



1984 నవంబరులో నెల్లూరు తుపానప్పుడు, 200 టన్నుల ఆహార పదార్థాలు, రోజుకి పాతిక తడవల చొప్పున, తాంబరం నుంచి, ఇండియన్ ఎయిర్‌ఫోర్స్‌కి చెందిన ఏడు హెలికాప్టర్లు చేరవేశాయి.

* * *

దక్షిణ రయిల్వేకి చెందిన ఒక సీనియర్ క్లర్క్ - జీతాలు బట్వాడాచేసే ఉద్యోగి - 1980-81 మధ్యకాలంలో దొంగ వోచర్లతో పన్నెండువేల బిల్లర గల్లంతు చేసినందుకు, కేసు విచారణ జరిపి, 1984డిసెంబరులో ఒక సంవత్సరం కఠిన శిక్ష విధించారు.



కార్పొరేషన్‌బాంకువారు మద్రాసులోని అరుంధతీపురవాసులు 336 గురుకి, 5 లక్షల 75 వేలు రుణ సహాయంచేశారు. 'బి అండ్ సి' మిల్సు వెనకనున్న మెట్టుపాలెయం వానులకి తమిళనాడు ఆదిద్రావిడ హౌసింగ్ అండ్ డెవలప్‌మెంటు కార్పొరేషన్ వారు, సాలుసరి ఆదాయం. రు.4,300 లోపున వున్నవారికి కొంత సబ్సిడీ అందచేశారు - జాతీయం చేయబడ్డ బాంకులు, తమిళనాడులో యింతదాకా ఆరులక్షల కుటుంబాలకి సహాయ పడ్డాయి; వచ్చే సంవత్సరం ఎనిమిది లక్షల కుటుంబాలకి సహాయపడాలని ప్రయత్నం.

* * *

మన సముద్ర తీరరేఖ 6080 కి. మీ. పది పెద్ద రేవుపట్నాలు, 185 చిన్నవీ వున్నాయి. మన వ్యాపార నౌకల సంఖ్య 300 పైగా వుంది ; సాలుసరి విదేశవ్యాపారం 20 వేల కోట్లు.



1985 నవంబరు మూడోవారంలో బెంగుళూరులో నాలుగవ అంతర్జాతీయ బాలల చలన చిత్రోత్సవం జరుగబోతున్నది. కర్ణాటక ఫిలిమ్ ఛాంబర్ సౌత్ ఇండియన్ ఫిలిమ్ ఛాంబర్ ఈ 'ఫెస్టివల్' లో పాల్గొంటున్నాయి. అమోల్‌పాలెకర్ - చిల్డ్రన్స్ ఫిలిమ్ సొసైటీ అధ్యక్షునిగా- ఈచిత్రోత్సవ విజయానికి కృషి చేస్తున్నారు.



సౌందర్య మనగా ఈ విపరీత ప్రపంచపు ముడి పదార్థం నుంచి ఆత్మబలి దానంతో కళాకారుడు సృష్టించే అనుపమ లావణ్యం

—సోమర్సెట్ మామ్



## డైరీ

### 1985 మే 9

'సితారా' చిత్రం మూడు జాతీయ బహుమతులు (ఉత్తమ ప్రాంతీయ చిత్రం, ఉత్తమ ఎడిటింగ్, ఉత్తమ ప్లేబాక్ సింగర్) అందుకొన్న సందర్భంగాను, దర్శకులు విశ్వనాథ్, నిర్మాత ఏడిద నాగేశ్వరరావు జూన్ మూడోవారంలో ఇటలీలోని 'ఫిజారో' లో జరిగే చలన చిత్రోత్సవంలో 'సిరి సిరి మువ్వ'- 'శంకరాభరణం' ప్రదర్శనకు ఎన్నికైన కారణంగా అక్కడికి వెళ్తున్న సందర్భంగాను, సాయంత్రం ఆరుగంటలకు పూర్ణోదయావారి డాబామీద ప్రెస్‌మీట్. 'నాకు లక్షలు ఆర్జించాలనిలేదు; మంచి చిత్రాలు ప్రజలకు యివ్వగలిగాననే తృప్తి మిగిలితే చాలు. సిరి సిరి మువ్వ, శంకరాభరణం, సీతాకోకచిలక, సాగర సంగమం, సితారా యిలా ప్రతి ఒక్క చిత్రమూ, సుశీల, బాలసుబ్రహ్మణ్యం, యస్ జానకి, మహాదేవన్, ఇళయ రాజా, వాణీజయరామ్‌లకు, సంగీత పరంగా జాతీయ గుర్తింపుకు సహాయ పడ్డాయీ అంటే అంతకుమించిన ఆనందమేముంటుంది? వైలెన్స్‌కీ సెక్సుకీ దూరంగా, వ్యాపారన్యాయం విస్మరించకుండా, కుటుంబ సభ్యులందరూ చూసి హర్షించే రీతిని చిత్రం తీయడం నా ధ్యేయం.... దర్శకుడిగా 'వంశీ'కి స్థానమేర్పడింది 'సితారా' తో.... నిర్మాతగా నాకు అంతర్జాతీయ ఖ్యాతి తెచ్చిన ఘనత దర్శకులు విశ్వనాథ్ గారిది....మా తదుపరి చిత్రానికి దర్శకులు విశ్వనాథ్‌గారే.... ఇటలీనుంచి వచ్చాక మళ్లీ కలుసుకుందాం-అప్పుడా వివరాలన్నీ చెబుతాను," - అన్నారు ఏడిద నాగేశ్వరరావు. 'సాగరసంగమం' చిత్రాన్ని రష్యన్ భాషలోకి డబ్ చేసి (సంభాషణలు మాత్రమే - పాటలు తెలుగులోనే వుంటాయి) సోవియట్ యూనియన్ లో నాలుగు వందల ప్రింట్లు రిలీజ్ చేశారు. సాంస్కృతికంగా 'గట్టిమేల్' చేయగల అవకాశం సమకూరినప్పుడు దానిని సద్వినియోగపరుస్తున్నారు నిర్మాత నాగేశ్వరరావు.... 'నాద్వారా ఈ కళాసేమలో కొన్నిపనులు జరుగవలసి వుంది-అవి నేను చేస్తున్నాను నిమిత్తమాత్రుడిని. చేయిస్తున్నది ఆ పరమేశ్వరుడు' - అనే ఆస్తిక్యం, ఆత్మోన్నతి గల దర్శకులు విశ్వనాథ్, నిశిత దృష్టిగల మేధావి, ఉత్తమ సాహితీ పరుడు, గొప్ప కళాతపస్వీ... ('సాగర సంగమం' గురించి మేమప్పట్లో రాసిన సమీక్ష . . ఈ రెవ్యూ రాసేనాటికి "శంకరాభరణాని"కీ దీనికీ

పోలికెక్కడండీ - అది కళాఖండం, ఇదీ కళాఖండమేగాని.... ఆ 'కాని' చాలా పెద్దనోట వినబడింది. అయితే, మా దృష్టిలో ఈ చిత్రం 'శంకరాభరణం' కంటే [illegible] ఉదాత్తమూ ఉన్నత మూను శైలి క్లాసికల్ డాన్స్ కను లకు విందు. జంధ్యాల సంభాషణలు రసస్ఫోరకంగాను, వేటూరి పాటలు సుధాప్లావితంగాను, ఇళయరాజా స్వరకల్పన సంగీతఝరి లాగాను వున్నాయి. సందర్భశుద్ధితో కూడిన సన్నివేశాల లోని మెరుపులు, తళుకులూ వింతకాంతులూ, విచిత్రలసోయగాలూ దర్శకులు విశ్వనాథ్ అనుపమ ప్రతి భకు తార్కాణాలు. కావ్యాత్మగల యిటువంటి చక్కటి చిత్రాన్ని సమ ర్పించిన నిర్మాత నాగేశ్వరరావు అభి వందనీయులు....ఇది ఎంతో పొంది కైనరసరాగమంజరి"-'జగతి'-325 -సెప్టెంబరు1983...అలాగే 'సితారా' గురించి: "సినీతారల వ్యక్తిగత జీవి తాలలోకి తొంగిచూసి కథలల్లే పత్రికా రచనా విధానంపై విసుర్లు, ఆరోగ్య వంతంగా ఉన్నాయి. అయితే, గ్లామర్ కోసం, పాప్యులారిటీ కోసం ఆ తారలు కూడా కొంతమేర దోషులవుతు న్నారు. ఇక్కడ సితారా అటువంటిది కాదమకోండి - నా బ్రతుకు నన్ను బ్రతకనీయండి,-అని విలపించే కళా కారిణి. భానుప్రియ బాగా స్కోర్ చేసింది-సుమన్ తన పాత్రకు న్యాయం చేకూర్చాడు. 'వంశీ' దర్శకత్వం ఫలిం చింది. మళ్లా మరొక నృత్యగాన సమన్వితమగు ఎంటర్‌టైన్‌మెంటు సమర్పిస్తున్నారు నిర్మాత ఏడిద నాగే శ్వరరావు....'జగతి'-334.... జూన్ 1984)

.....13

"ప్రభూ, నన్ను శాంతి సాధ నాస్త్రాల పనివస్తువుగా చెయ్; ద్వేష మున్న చోట, ప్రేమని ప్రతిష్ఠించ నియ్; ఎక్కడైతే బాధో, అక్కడ క్షమ; ఎక్కడైతే సంశయమో, అక్కడ విశ్వాసం; ఎక్కడైతే నిస్పృహో, అక్కడ ఆశ; ఎక్కడైతే చీకటో, అక్కడ వెలుగు..... ఇవ్వడం ద్వారా, పొందుతున్నాం; మన్నిం చడం ద్వారా మన్ననందుకుం టున్నాం....' - ఇవి సెయింట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అస్సిసి చెప్పిన పలు కులు; వాటిలో సేవానిరతి, జీవిత పరమార్థమూ వున్నాయి. ధనార్జన తృష్ణనిస్తుంది; సేవాతత్పరత తృప్తి నిస్తుంది. దుర్గాబాయి దేశ్‌ముఖ్ వల్ల ప్రభావితురాలైన మిసెస్ ఎసి కృష్ణా రావు, 1949 నుంచీ 'స్త్రీసేవామం దిర్' ద్వారా చేస్తున్న స్వచ్ఛందసేవ మాటల్లో చెప్పేదికాదు - ఎవరికివారు స్వయంగా చూసిన మీదటగాని తెలీదు - ఎంతటి బృహత్కార్యాన్ని ఆమె సునాయాసంగా నిర్వహిస్తు న్నారో! అనాథలకు పునరావాసం, అభాగ్యులకు ఆశ్రయం, ఆడపిల్లలకు అనేకానేక వృత్తి విద్యలు, చిన్నపిల్లల ఆరోగ్యరక్షణ - ఒకటేమిటి, అదొక మహాప్రపంచం. 'శాలిగ్రామంలోని పేదపిల్లల' ముఖాలలోని వెలుగు,

కవితాప్రసూనంలా ఈ సంస్థ చరితం యావత్తూ ఒక్కముక్కలో చెబుతుంది. బంగ్లారోడ్‌లో ప్రింటింగ్ ప్రెస్సు, కుట్టుపని తరగతులు. ప్రయోజనవిద్య; రామకృష్ణా వీధిలో నున్న ప్యాకింగ్ యూనిట్; క్రెష్; అశోక్‌నగర్‌లోని జవహర్ విద్యాలయం, టైపింగూ షార్ట్‌హాండూ, అకౌంటెన్సీ, రేడియో అండ్ టెలివిజన్ మెకానిజమ్, టైలరింగ్, ఎంబ్రాయిడరీ, గాత్ర, వాద్య సంగీతం క్లాసులు, ఉద్యోగినుల పిల్లల క్రెష్ 'ప్రమోద,' సైన్సులో ఎక్స్‌పెరిమెంట్స్ వివిధ విద్యాలయాలలోని విద్యార్థినులు నేర్చుకొనేందుకు 'ప్రయోగ', ఫుడ్ ప్రాసెసింగ్ అండ్ ప్రిజర్వేషన్ – అంటే కూల్ డ్రింకులూ మొదలైనవి; వివిధ శాఖలలో తయారయే వస్తువులు విక్రయించేందుకు 'శతపత్ర' అనే షోరూమ్; అధునాతమైన కమ్యూనిటీ హాల్ 'మహోదయ' (మీటింగులకీ, సాంస్కృతిక ప్రదర్శనలకి). సాలిగ్రామములో: స్త్రీలకీ శిశువులకీ కస్తూరిబా గాంధీ హోమ్; వర్కింగ్ వుమెన్స్ హాస్టల్ 'సువ్రత'; నందినీ ప్రెసిషన్ వర్క్స్; డాల్ మేకింగ్, స్క్రీన్ ప్రింటింగ్, హాండ్ బ్లాక్ ప్రింటింగ్; హాండ్‌లూమ్ వీవింగ్; టయిలరింగ్ క్లాసులు; 'ఇండస్' కాఫీపొడరు; 'గౌతమి' కాండిమెంట్స్ 'సురుచి' బేకరీ; 'నర్మదా' వుమెన్స్ అకాడమీ; మాతా శిశు వైద్యకేంద్రం; డెంటల్ క్లినిక్; కావేరీ కిండర్‌గార్టెన్; కావేరీ మిడిల్‌స్కూలు; 'సుధర్మా' కమ్యూనిటీహాలు. విరుగంబాకమ్‌లో: అనాథశిశు శరణాలయం; షార్ట్‌టైము ట్రెయినింగ్ క్లాసులు; చెంగల్పట్టు జిల్లా సోమమంగళంలో కూడా ఇదేమాదిరి స్త్రీ శిశు సంక్షేమాభివృద్ధికని ఉద్దేశించిన కార్యక్రమాలు .... ....

స్వచ్ఛంద సేవాసంస్థలలో 'స్త్రీ సేవా మందిర్' చేస్తున్న కృషి అపూర్వమూ అద్వితీయమూను.... ఈ సంవత్సరం జమ్నాలాల్ బజాజ్ అవార్డ్, ఏ స్వచ్ఛంద సేవాసంస్థకు యివ్వడమా అనే విషయమై ప్రత్యక్ష పరిశీలన జరిపేందుకు వచ్చిన అవార్డ్ కమిటీ సెక్రటరీ వి. జె. జోషి, 'మహోదయ' లో ఏర్పాటు చేసిన 'గెట్ - టు - గెదర్' సందర్భంగా మాట్లాడుతూ అన్నారు: "ఈ సంస్థ వేర్వేరు శాఖలు విజిట్ చేస్తున్నపుడు నేను ఆశ్చర్యపోయాను. ఇక్కడ మాటల్లేవు - చేతలే ముఖ్యం, చేసి చూపించడమే ముఖ్యం. నిశ్శబ్దమగు కృషితో గణనీయమగు కార్యసౌధం నిర్మించారు మిసెస్ కృష్ణారావు - వారికి నా హృదయ పూర్వక నమోవాకాలు, అవార్డ్ మాట అటుంచి, ఈ పర్యటన, నా అనుభవసంపదని ఎంతగానో పెంచింది - అందుకు నా కృతజ్ఞతాంజలులు.".... వి జె జోషీతో, మిసెస్ జోషికూడా వచ్చారు. ఆమె ఒక మరాటీ పుస్తక ప్రచురణ సంస్థలో ఎడిటర్. స్త్రీ సేవామందిర్‌లోని శాఖలు చూస్తున్నప్పుడు, ఆమెకి కొన్నిటినుంచి ఎంతకీ బయటకు రాబుద్ధయేది కాదట. మనసునంతగా ఆకట్టుకొనే మహత్తరకృషి చేస్తున్నారు స్త్రీ సేవా మందిర్‌వారు.

. . . . . 17

"నాకున్న ఇమేజ్‌కి భిన్నమైన చిత్రాలు ప్రేక్షకులు ఆదరించరు. 'సంధ్యారాగం' మీరంతా బావుంద న్నారు. కాని, ప్రజలు ఆదరించలేదు; వారు 'మెరుపు దాడి'ని మెచ్చు కున్నారు. ప్రథమంగా నేనుదర్శకత్వం వహించిన ఈ 'రణరంగం' కూడా ఫాంటసీయే! యాక్షన్‌కే ఎక్కువ ప్రాధాన్యం. నాలుగే పాటలు వుం టాయి. క్లయిమాక్స్ సీను ఒక్కటే పూర్తి కావల్సివుంది - అందులో ఆరువందల మంది పాల్గొంటున్నారు. జూన్ నెలాఖరు లోపున పూర్తవు తుంది. ఏ చిత్రానికైనా క్లయిమాక్సే కదా జీవం - అందుకని దానిని భారీ గాను, రసస్ఫోరకంగాను, చిత్రీకరిస్తు న్నాను ఒక పిక్చర్‌కి డైరక్షనంటే, యాక్టు చేసేవి నాలుగు వొదులుకోవలసి వస్తుంది.... నేనూ, భానూచందర్‌తో బాటు సుమలత, సత్యనారాయణ మున్నగు వారు పాల్గొంటున్నారు; చక్రవర్తి మ్యూజిక్ యిస్తున్నారు"- అన్నారు గిరిబాబు, వారి డాబా మీద జరిగిన పత్రికా సమావేశంలో. జంఘిస్ ఖాన్ పోలికలు యిందులో ఒక పాత్రకి వుంటాయని తెలిపారు భానుచందర్. ప్రెస్ మీట్ తర్వాత డిన్నర్. ఆరు బయటకాబట్టి చల్లగా వుంది - వేసవి ఎండలు మరిపిస్తూ!

—యన్నార్ చందూర్

## మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటా యనుకోనే 'జోక్స్' నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ప్రచురణ నిమిత్తం పంపే రచనలతోబాటు పోస్టుబిళ్లలు అతికించిన పొడుగుకవరు వుంటేకాని అంగీ కారం కానివి వెనక్కి పంపడం సాధ్యం కాదు. మా ఊళ్ళో 'జగతి' దొరకడం లేదనేవారికి ఒక్కటే మనవి-చందాదారులుగా జేరమని! సంవత్సరానికి ఇరవై రూపాయలు: రెండు సంవత్సరాలకి ముప్ఫయి ఎనిమిది.

JAGATI - 2, Kutchery Road, P B 2922, Madras - 600 004

# ముఖ చిత్రం

ప్రఖ్యాత మేధావులలో ఒకరూ, ఆధునిక ప్రపంచపు ఆధ్యాత్మిక గురువూ అయిన జిడ్డు కృష్ణమూర్తికి, 1985 మే 11వ తేదీకి తొంభయి వసంతాలు నిండాయి. గత నలభై సంవత్సరాలుగా ఆయన పలుకులూ ఉపన్యాసాలూ వినే సద్భాగ్యం నాకు కలిగింది. మానవ హృదయ కుహరం లోకి వెలుగు రేకలు ప్రసరింపజేసిన మహనీయుడాయన.

'నీకు నీవే దీపమవాలి' (Be a Light unto yourself) అని చాలా సంవత్సరాలక్రితం ఆయన చెప్పారు. అలా ప్రబోధించడమే గాకుండా, దేశ దేశాలకు నిర్విరామ యాత్రికునిలా పయనిస్తూ, తన సందేశం వ్యాప్తం చేశారు. మనసులోని మంచితనం మొగ్గ తొడగాలి - అదే మానవాళికి శ్రేయో మార్గం.

తీక్ష్ణ పరిశీలన, విశుద్ధ అవగాహన, నిశితదృష్టి, నిరంతర అధ్యయనం - వీటికి తోడుగా ప్రేమానురాగాలూ దయాంతఃకరణా ఆయనని ప్రపంచంలో ఎందరికో ఆప్తునిగా చేశాయి. ఆత్మశోధనకు ప్రయోగాత్మక అవగాహన ఎలా దోహద కారి కాగలదో ఆయన స్వయంకృషితో చూపారు. మన దైనందిన జీవితంలో చైతన్యం చిగురించాలంటారు.

గౌతమ బుద్ధుని బోధలు విన్నట్టు వుందని ఆల్డస్ హక్స్లే, ప్రతిభావంతుడైన తేజశ్శాలి అని బెర్నార్డ్‌షా, 'ఆయన రాక ప్రేమస్వరూపుని పాదాల సవ్వడిలా ఉంటుంది' - అని కాహ్‌లిల్ గిబ్రాన్ అన్నారు.

జిడ్డు కృష్ణమూర్తి ఆధ్యాత్మికతలో విశ్వమానవశ్రేయం ఉంది. "ప్రపంచమంతా మారణాయుధాలు సమకూర్చుకుంటోంది - సర్వనాశనం కోసం. ఆ ఆయుధ సేకరణ కోసం విపరీతంగా ధనం వ్యయం చేస్తున్నారు. ఇందులో అందరూ దోషులే! రాజకీయ వేత్తలు ఈ క్లిష్టసమస్యను పరిష్కరించలేరు- వారిపై ఆధారపడి ప్రయోజనం లేదు. సైంటిస్టులూ అంతే - మిలిటరీ టెక్నాలజీ విషయంలో పోటీపడుతున్నారు. ఇక, మతశక్తులంటారా, వాటిలో శబ్దాడంబరమూ శుష్క ఆచారమూ తప్ప, జీవం లేదు. రాజకీయవేత్తలు యావత్ప్రపంచంలో తమ అధికారం, తమ ప్రతిష్ట, తమ స్థాన బలిమి కోసం పోరాడుతున్నారు. సైంటిస్టులు నూతన విధ్వంసకాయుధాలు నిర్మిస్తున్నారు. ఏ మత ప్రభావమూ ఈ అల్లకల్లోలాన్ని సరిదిద్దలేదు" - (న్యూఢిల్లీలో - 31-10-'82)

సత్యాన్వేషణ అనేది జీవితకాలమంతా సాగవలసిన శోధన. మానవుని అంతర్ముఖ విప్లవమది; తద్వారా నవచైతన్యం పొందుతాడు.

ఆంధ్రాలోని మదనపల్లిలో మధ్య తరగతి బ్రాహ్మణ కుటుంబంలో ఎనిమిదో సంతానంగా జన్మించిన కృష్ణమూర్తినీ, ఆయన తమ్ముడు 'నిత్య'నీ

తం(డిగారు, దివ్యజ్ఞాన సమాజం అధ్యక్షురాలు ఆనిబిసెంట్‌కి చెప్ప జెప్పారు. దివ్యజ్ఞాని లెడ్‌బెటర్‌కి పదమూడేళ్ళ కృష్ణమూర్తి ముఖంలో తేజోచక్రం కనిపించిందట. మానవాళిని కాపాడనున్న అవతారపురుషునిగా ఈ బాలుని తీర్చిదిద్దడం ప్రారంభించారు. 'ఆర్డర్ ఆఫ్ ది స్టార్' (Order of the Star) అనే ప్రపంచ సంస్థ ఉదయించింది. హాలెండ్‌లో ఈ సంస్థకు గల అయిదువేల ఎకరాల క్షేత్రంలో, 1928లో జిడ్డు కృష్ణమూర్తి, తన శిష్యవర్గాన్ని విస్మయంలో ముంచుతూ, తను అవతారపురుషుణ్ణి కాదని బాహాటంగా ప్రకటించారు; ఆ సంస్థని రద్దు చేశారు. "సత్య పథానికి, వేసిన బాటలంటూ లేవు. ఏ వ్యవస్థ ఏ విశ్వాసమూ సత్యలోకానికి తీసుకువెళ్ళలేవు. ఇకనుంచి నేను గురువునీ కాదు, మీరు శిష్యులూ కాదు; అందరమూ సాధకులం. సత్యమనేది మీలోనే ఉంది; అది తెలుసుకొనేందుకు, బంధవిముక్తులవాలి."- అంటూ తన చుట్టూ నిర్మితమైన కట్టడాన్ని పడగొట్టారు కృష్ణమూర్తి.

'కామెంటరీస్ ఆన్ లివింగ్' (Commentaries on living) మూడు సంపుటాలూ శ్రద్ధగా చదివితే, ఆయన చూపే మార్గం బోధపడుతుంది. సత్యశోధన, బంధవిముక్తి - ఈ రెండూ ప్రధానాంశాలు. మన 'బాంధవ్య దర్పణం' ద్వారా ఆత్మావలోకనం చేసుకోగలగాలి. బంధవిముక్తి అనేది బంధాల ఉనికిని గుర్తించడం ద్వారా వాటి లక్షణాలు గ్రహించడం ద్వారా (Choiceless Awareness) సాధ్యమవుతున్నది. మనోదీపిక ఒక్కటే (Flame of Attention) కలతలనీకన్నీళ్ళనీతుడిచేది.

వ్యక్తి మారనిదే సంఘం మారదు. వ్యక్తి పరివర్తన నుంచే సమాజ స్వరూపం మారుతోంది. ఆ పరివర్తనకు మ నో క మ ల ం విచ్చుకోవాలి (Inward Flowering). ఆ అనుభూతి, వైరుధ్యాలని హరిస్తూ సామరస్యం నెలకొల్పుతుంది. 'మనోవికాసమనేది ఒక గమ్యం కాదు - ప్రేమ వాహినిలోని చైతన్య నౌక' అంటున్నారు కృష్ణమూర్తి.

ఎవరి జీవితం వారికొక మహాగ్రంథం. అలకించడం, పరిశీలించడం, వీక్షించడం, నేర్చుకోవడం ఈ కళలూ యిలాటివి కెన్నో ఆ గ్రంథంలోని వివిధ ప్రకరణలు. ప్రేమతోను, జాలితోను చేసే పనులకు మించిన పవిత్ర కార్యం మరొకటిలేదు. ఆ రెండే మనో ముద్రితాలను చెరిపి, మనసుకి ధావళ్యమిస్తాయి" అంటారాయన.

'అంతర్ముఖ వీక్షణతో జనించే అంతరంగ పరివర్తన - ఆ మార్పు మాటల కందని మహదానుభూతి. దివ్య చక్షువుకి గోచరించే ఆ అనుభవ జ్ఞానం కోసం మానవుడు తరతరాలుగా ఆరాట పడుతున్నాడు. అజ్ఞాన సంపదే నూతన మానవోదయ కాంతి' అంటున్నారు జిడ్డుకృష్ణమూర్తి.

—కెయస్ రామానుజమ్

## సమీక్షలు




### విజయ మాధవీ వారి 'తిరుగుబాటు'

కృష్ణంరాజు, మోహన్‌బాబు, జగ్గయ్య, ప్రభాకరరెడ్డి, అల్లురామలింగయ్య, నూతన్ ప్రసాద్, మిక్కిలినేని, జయసుధ, సుమలత, విజయశాంతి, సిల్క్‌స్మిత మున్నగు ప్రముఖ తారాగణంతో, చిరపరిచిత సినీ ఫార్ములాతో దాసరి నారాయణరావు దర్శకత్వంలో తయారైన భారీ చిత్రమిది. రాజాబాబు (కృష్ణంరాజు) తమ్ముడు బోసు, (మోహన్‌బాబు) తన చదువింకా పూర్తిగాక పూర్వమే, సంఘం మరమ్మత్తుకి పూనుకుంటాడు. అసలీ చిత్రం ప్రారంభమవడమే, ప్రయివేట్ క్లాస్ వుందనుకొని వచ్చిన శాంతిని లెక్చరరు బలాత్కారం చేయడంతో! 'రేప్' తప్పదు కాబోలనిపిస్తుంది - కాని, శాంతి నేర్పుగా తప్పించుకుంటుంది. ఈ దురాగతానికి సమ్మె ; బోసు నాయకుడు. తల్లిదండ్రులకి హాని జరుగుతుందేమోననే భయంతో, లెక్చరరు తనని బలాత్కరించబూనడం సర్వాబద్ధమని లెటర్ రాసిస్తుంది శాంతి ; కాని, తన ఫ్రెండయిన బోసుకి అసలు విషయం చెబుతుంది. అయిదు లక్షల 'రాన్సమ్' కోరుతూ, ఊళ్లోనుంచి ఒక పదహారేళ్ల పిల్లనెత్తుకుపోయిన బందిపోటుల ముఠాకు నాయకురాలు ఝాన్సీ (సుమలత). పాములు పుట్టలో వున్నంతవరకే గాని, బయటికొస్తే పాములవాడు బుట్టలో పెట్టి, తన యిష్టమొచ్చినట్టు ఆడిస్తాడని చెప్పే ఝాన్సీ, తెల్లబట్టల రాజాబాబు గాంధీ సూక్తులు చెప్పేసరికి, అస్త్రసన్యాసం చేసి, పోలీసువారికి లొంగిపోయి, తనకీ తన మనుషులకీ కలెక్టరుగారిచ్చిన భూమి పట్టాలు పుచ్చుకుంటుంది. (జయప్రకాశ్‌ని బందిపోటు నాయకులు శరణుజొచ్చినది, ఆ విధంగా కాదు). ఈ చిత్రమంతకీ అసలు సిసలు కథానాయిక, రూపాదేవిగా సిల్క్‌స్మిత. ఆమె భూగర్భగృహంలో 'కానిబాల్స్' ఉంటారు. (నరమాంస భక్షకులని ఎందుకనుకోవలసివస్తున్నదంటే, పోలీసులని వారు పీక్కుతిన్న సూచనవల్ల). ఆమె కాముకత్వంలో ఈ రాక్షసులతో కేళీ వినోదం ఒక భాగం. డిఐజి జగదీష్‌ని (జగ్గయ్య) చిటికినవేలుమీద తిప్పుకోవడమేగాకుండా, ముఖ్యమంత్రిని

లేపేసే ఉపాయం కూడా చెబుతుం దామె; ఆ పని చేయిస్తుంది కూడా! బోసు ఆ రూపాదేవి ఆ గ్రహానికి బలై పోగా, శాంతి తన బాయ్‌ఫ్రెండ్ బోసు తో బాటు ప్రాణాలు వొదులుతుంది. నిశ్చయతాంబూలానికని తెచ్చినవీరె, రాజాబాబు ఆమె మృతదేహంపై కప్పుతాడు. తమ్ముని మరణంతో, అంతదాకా అహింస బోధించిన రాజా బాబు, హింసకు ప్రతిహింస తప్ప దంటాడు. తుపాకులూ, గుర్రాలూ, మోటారు సైకిళ్లూ ఇట్టే ఏర్పడిపోతాయి. ఝాన్సీ మళ్ళీ నాయకురాలి డ్రెస్ వేసు కుంటుంది. ఏ కమీషనరైతే తన తమ్ముని డైరీ తగులపెట్టాడో, అతనిని అడవులలోకి పట్టుకొచ్చి కాల్చడంతో ప్రతీకార ప్రకరణ ప్రారంభమవు తుంది. రూపాదేవి భూగర్భ గృహం లో బంధితుడైన రాజాబాబుకి పార్వతి (జయసుధ)అంటే భార్య, పసి బిడ్డ తల్లి, తన చనుబాలుయిచ్చి ఎక్కళ్ల ప్రమాదం నుంచి భర్తని కాపాడుకుం టుంది. అయితే పాలులేక ఆ పసిబిడ్డ మరణిస్తాడు. పార్వతికూడా పగతీర్చు కోసమని ధైర్యం నూరిపోయడంతో, గొలుసులు తెంచుకొంటాడు రాజా బాబు ('సామ్సన్ అండ్ డీలైలా'లో గొలుసులు తెంచుకోవడమూ భూప్ర కంపన ఒకేసారి సంభవిస్తాయి - తెలుగు సినిమాకిఅలాంటి పట్టింపులేమీ లేవు). ఝాన్సీ తన మనుషులతో అక్కడికి వస్తుంది. రైలులోపారిపోతున్న రూపా దేవి బృందాన్ని గుర్రాలమీద, మోటారు సైకిళ్లమీద, 'షోలే'లో మాదిరి వెంబడిస్తారు. వారు వున్న బోగీని మిగతా ట్రయిన్‌నుంచి వేరు చేసి, ఫైర్‌బాంబుతో కాల్చేస్తారు. రాజా బాబుని పోలీసులు పట్టుకుపోతారు- అదీ కథ.... పోలీసుశాఖలోని ఉన్నతో ద్యోగులు యింత నీతిబాహ్యులా? నమ్మలేము. 'చెడు' అన్ని శాఖల్లోనూ ఉంటుంది. కాని, 'చెడు'నే గ్లామరైజ్ చేయటం వినోదవ్యాపారలక్ష్యంకాకూ డదు. లంచగొండులైన పోలీసు వుద్యో గులు వుండవచ్చు. కాని, శాఖ యావ త్తూ అంతేనన్నట్టుగా చిత్రించడం సమర్థనీయంకాదు. ఫూలన్ దేవిని సగం ఝాన్సీగాను, సగం రూపాదేవిగాను చిత్రించారు. అయితే, ఫూలన్‌దేవి బాక్ గ్రవుండ్ - ఏ పరిస్థితులు ఆమెని అలా చేశాయో- అది వొదిలేశారు. ఇందిరా గాంధీ హత్య మాదిరి ముఖ్యమంత్రి హత్య జరుగుతుంది. ఆమె అక్బర్ రోడ్ ఇంటి వికెట్‌గేటు వద్దనైతే, ఈయన పువ్వులు కోస్తూ! శాంతియుత జీవనం నమ్మిన గాంధేయ సిద్ధాంతాల వ్యక్తి, తమ్ముని మరణంతో విప్లవవాది గా మారి, తుపాకీ చేతబట్టి, తనవాళ్లను కూడగట్టుకు, హింసకు ప్రతిహింసే సమాధానమని నిరూపించడం యిందు లోని యితివృత్తం. ఇందుకుగాను ప్రేక్షక జనరంజక మనిపించే సన్ని వేశాలనేకం సమకూర్చారు. దేశంలోని క్రయిమ్‌రేటు పెరగడానికి యిటువంటి చిత్రాల బాధ్యత ఎంత?- అనేది సోషల్ సైంటిస్టులు పరిశీలించదగు అంశం. లోక్‌సభ ఎన్నికలలో బహు గుణాని ఓడించాడు అమితాబ్‌బచన్

కాంగ్రెస్ టికెట్ మీద! కాని "ఈ దేశంలో దౌర్జన్యం దోపిడీ ఘాతు కాలూ పెరగడానికి మీ 'సినీ ఇమేజ్' ఎంతవరకూ కారణం?" అని మేధావులు అడిగిన ప్రశ్నకు ఆయన వద్ద సమా ధానంలేదు. సినిమా చాలా శక్తి వంత మగు మీడియమ్ - దానివెంట కొన్ని సాంఘిక బాధ్యతలు వున్నాయి. దాసరి నారాయణరావు వంటి ప్రఖ్యాత దర్శకులు తీయదగు చిత్రమా యిది? - అనే ప్రశ్న రాకమానదు. జన రంజనకు, ఆర్థిక విజయానికీ సందేహం లేదు. అందరూ ప్రసిద్ధ నటీనటులు. జయసుధ భూగర్భగృహంలో జాలి గాధ పలికిస్తే, అందము అహమూ ఐశ్వర్యమూతో ఈ లోకాన్నీ సంఘాన్నీ రసరాజ్యంగా మారుస్తుంది సిల్కు స్మిత. కన్నెవలపుల విజయశాంతి, విప్లవవచనం పలికే సుమలత, ఆత్మ నమ్ముకున్న డి ఐ జి గా జగ్గయ్య. విభిన్న ప్రవృత్తుల అన్నదమ్ములు కృష్ణంరాజు, మోహన్‌బాబు, డాక్టర్ వృత్తిని హాస్యాస్పదంగా చిత్రించే నూతన ప్రసాద్, రూపాదేవికి నమ్మిన బంటులా అల్లురామలింగయ్య - యిలా ప్రతి ఒక్కరూ తమ పాత్రలు చక్కగా పోషించారు. నిర్మాత: వడ్డె శోభ నాద్రి; నిర్వహణ: వడ్డే రమేష్.

జయా చిత్రవారి

'కి లా డీ'

కండలు తిరిగిన వ్యాయామవీరుడు మురళికి (కమలహాసన్) పోలీసాఫీసర వడం జీవితధ్యేయం. ఫోటోగ్రాఫరూ పెయింటరూ అయిన ఉమ (అంబిక) యితనికి కాక్‌టైల్‌డ్రెస్ కుట్టించి పెడుతుంది జిప్ లాగడం చేతగాకపోతే నేర్పు తుంది; తను స్నానంచేస్తూ వీపురుద్ద కూడదా అని కవ్విస్తుంది; మీదపడి ముద్దుపెట్టుకు ఆబొమ్మ, తన చిత్రకళా ప్రదర్శనలో 'నాట్ ఫర్ సేల్' అనే హెచ్చరికతో వేలాడగడుతుంది. అంతే గాక, తనప్రియుని, చిన్నపిల్లల మంకు పట్టులాటి ఆ పోలీసు జాబ్‌కోసం, అర చేతిలో హారతికర్పూరం వెలిగించుకు దేవునికి అప్పీల్ చేస్తుంది. ఈమె ప్రాణసఖి; మరొక ప్రియనెచ్చెలి అనిత (మాధవి) తటస్థపడుతుంది తెరమరుగు యడ్వంచర్‌లో. ఈత కొలనులో తనని వివస్త్రను గావించి నప్పటికీ, మురళి, మనోధర్మం తెలి సిన అనిత, చివరిదాకా స్నేహితు రాలిలా మసులుతూ, ప్రాణాలకు తెగించి అతనిని కాపాడి, తను అంత మవుతూ మురళీ ఉమలని కలిపేందుకు, ఉమ మనసులోగల మబ్బుతెర తొలి గిస్తుంది. స్మగ్లింగ్‌నీ క్రయిమ్‌నీ గ్లామ రైజ్ చేసే ఈ చిత్రాన్ని అంబిక, మాధవి చెరో కోణంనుంచి కాపాడు తున్నారు. కమలహాసన్ వంటి నటుడు, నేరప్రవృత్తికి దోహదమిచ్చే యిట్టి వంటి చిత్రాలలో పాల్గొనడం విచార కరం. నటీనటులకు వృత్తిన్యాయమూ ధనార్జనేగాక సాంఘిక బాధ్యతకూడా ఉంది. తెలుగులోకి డబ్ చేయబడిన ఈ యాక్షన్ థ్రిల్లర్ నిర్మాతలు ఏడిద నాగేశ్వరరావు కుమారులు.

# రాం ప్రసాద్‌వారి 'అనురాగ బంధం'

కావేరీ (సరిత) కళ్యాణ్ (శరత్ బాబు) అన్యోన్య దంపతులు; వారి సంసార సరిగమల శృంగార ఛాయల్లో పిక్చర్ ప్రారంభమవుతుంది. ఏడెనిమిదేళ్ళ బాబు వున్నాడు; తల్లిదండ్రులకి చెరో బుగ్గాయిస్తూ, వారి వెడ్డింగ్ యానివర్సిరీ రోజున యిద్దరి మీదా పువ్వులు జల్లే ఈ తరం బాలుడు. అమాయక గృహిణి కావేరి, మహిళా మండలి వారి వస్తువుల వేలంలో, రాధాకృష్ణుల బొమ్మకి పోటీ వెయ్యి రూపాయిల దాకా పెడుతుంది; మిసెస్ పవిత్ర రెండువేలు అనేసరికి, వెనక్కి తగ్గుతుంది. అయితే, ఆ పవిత్ర (జయసుధ) రెండువేలకు పాడిన ఆ బొమ్మను, కావేరికి తన మనఃపూర్వక కానుకగా సమర్పిస్తుంది; ఈమె తీసుకొంటుంది. 'అంత ఖరీదైన కానుక పుట్టినే యివ్వరు- ఏదో కథ ఉంటుంది'- అంటాడు భర్త కళ్యాణ్. మనకీ అంతే అనిపిస్తుంది; కావేరికి కారుడ్రయివింగ్ నేర్పిన పవిత్ర, కళ్యాణ్‌ని ఆ యింట్లో చూసినప్పుడు, కథాక్రమం నెమ్మదిగా అవగతమవుతుంది. ఫ్లాష్‌బాక్.... బంధువులంటూ లేని పేద యువకుడు కళ్యాణ్‌కి, తమ ఆఫీసులో ఉద్యోగమివ్వడమే గాకుండా, అవుట్‌హౌజ్‌లో ఆశ్రయ మేర్పర్చి, ఆపైన హృదయంలో స్థానమిస్తుంది పవిత్ర - నిరుద్యోగ సమస్య తీరేందుకు యిలాంటి యువతి తటస్థపడితే బావుండునని నవయువకులందరూ ఆశించేటట్టు! .... తన స్థాయికి దగ్గ పై చదువులకి ఈ యువకుని లేవనెత్తేందుకు, పై చదువులకి అమెరికా పంపిస్తుంది; పై చదువులు ఎందుకంటే, ఈ వ్యాపారాన్ని పదింతలు పెంచేందుకు! వారి వ్యాపార మేమిటో మనకు తెలీకుగాని సువిశాలమైన ఏసి రూమ్‌లో ఆమె మేనేజింగ్ డైరక్టరు. అమెరికా వెళ్ళబోయేముందు, వర్షంలో బాగాతడిసి, కారు వెనకసీట్లో కక్కుర్తి పడ్డవైనం, వైపర్ తెలుపుతుంది. కళ్యాణ్ అమెరికా చేరుకొన్న మూడు నెలలదాకా స్వీట్ లెటర్స్ వస్తాయి -- ఆపైన అవి నిలిచిపోతాయి. అయినప్పటికీ అతను కోర్సు ముగించుకు యింటికి వస్తాడు. పవిత్రకు పెళ్ళయిందని అంకుల్ చెబుతారు. షాక్! ఆఫీసుకి వెళ్లి పవిత్రని అడుగుతాడు. 'అవును, చేసుకున్నాను; మామూలు మనిషివి నిన్నెంతవాణ్ణి చేశానో మర్చిపోతున్నావ్, గెటవుట్'- అంటుంది. ఇంకా తీవ్రమైనషాక్. అమెరికా వెళ్లివచ్చాడు గనక యితనూ ఒక మేనేజింగ్ డైరక్టరైపోయాడు - కావేరిని పెళ్లిచేసుకున్నాడు. మారుతీ కారూ, నిండు సంసారమూతో సుఖంగా వున్నాడు. ఏడెనిమిదేళ్లు గడిచిపోయింది. పిడుగులా తటస్థపడుతుంది పవిత్ర. ఆమెది ఎంత గొప్పమనసో ఈ కావేరి చెబుతూంటుంది. అదీ సస్పెన్స్. మూడు నెలలయాక ఉత్తరాలు ఎందుకు రాయలేదయ్యా అంటే, కోటిమందిలో ఒక్కరికి వచ్చే

ప్రత్యేకమైన గుండెజబ్బు ఈ పవిత్రని వెతుక్కుంటూ వచ్చింది; అబార్షన్ చేయించటం మంచిదని డాక్టరు చెబుతాడు (బాక్‌సీట్ సమాగమ ఫలితం); తన కడుపులో పెరుగుతున్న కళ్యాణ్ ప్రతిరూపాన్ని యింత ప్రేమించిన పవిత్ర వొదులుకుంటుందా? అబార్షన్‌కి వొప్పుకోదు; అబ్బాయిని కంటుంది. కళ్యాణ్ భవిష్యత్తు పాడైపోతుందని ఈ విషయాలేమీ అతనికి తెలీనీయదు. తనకి ప్రత్యేకమైన గుండెజబ్బు వుంది గనుక సంసారానికి అర్హురాలు కాదు. అంచేత, తన ప్రేమను త్యాగంచేసి, కళ్యాణ్‌కి నూతన జీవితమిద్దామనుకుంటుంది. ఆ త్యాగంలో భాగమే ఈ తిరస్కారమూ, తనకి మరొకరితో పెళ్ళయిందనే అబద్ధమూను! మనలాటి సామాన్యులకు ఆ త్యాగమేదో కళ్యాణ్‌తో సంప్రదించిన మీదటే చేయవచ్చు కదా – అనిపిస్తుంది. కాని, సినిమా పవిత్రలు అలాచేయరు; వోవర్సీస్ కాల్స్ నిర్దాక్షిణ్యంగా తుంచేస్తారు; తమకెంత తోస్తే అంతవేసి, తమ ధనాధికృతతో కప్పి బుచ్చుతారు. పవిత్ర, సినిపతివ్రతలా, కళ్యాణ్‌నే చిత్తశుద్ధితో ప్రేమిస్తూ వుంటుంది; కొన్ని సంవత్సరాలయాక, కావేరి యింట్లో, కళ్యాణ్‌ని చూస్తుంది. ప్రథమకోపం అతనిలో భగ్గుమంటుంది; ప్రణయ స్మృతులూ జాలిగాథా దానిని చల్లారుస్తాయి. 'డాడీ' ని చూపిస్తుంది పవిత్ర, తన కొడుక్కి; తండ్రీ కొడుకులని కలుపుతుంది; కావేరీ ఆంటీ యింట్లో వున్నప్పుడు, డాడీని 'అంకుల్' అని పిలవాలి, అంటూ, హితవు బోధిస్తుంది — ఆపరేషన్‌కి బొంబాయి వెళ్తూ! గోమాత విషయంలో పులి కనికరం చూపినట్టు, విధాత పవిత్ర విషయంలో దయ తలుస్తాడేమో అనుకుంటాం. మృత్యుశయ్యపైవున్న పవిత్రని, చూడటానికి వెళ్ళని తన భర్తను, వంచకునిగాను, రాక్షసునిగాను భావించిన కావేరి, పవిత్ర తిరి

## మంచి కథకు రు 558

యువజన ప్రగతి యితివృత్తంగా కథానికలను 'బిసిటి' వారు (బందా చారిటబుల్ ట్రస్ట్) ఆహ్వానిస్తున్నారు. ఉత్తమ కథానికకు రు. 558/- బహుమతి. ఎన్నికైన కథను పత్రికలో ప్రచురించే ఏర్పాటు చేస్తారు.

అందవలసిన చివరితేదీ: ఆగస్టు 15, 1985. బహుమతి ప్రకటన : సెప్టెంబర్ రెండోవారంలో.

అడ్రసు : 'రిపోజ్' 10 - 4 - 37 / A, హుమయూన్ నగర్, హైదరాబాదు-20



గొస్తే ఊరుకుంటుందా? తను చచ్చి, వాళ్ళిద్దరికీ పెళ్ళి చేస్తాననవచ్చు.... పోతే, పవిత్రకొడుకు కావేరికొడుకు కంటె కనీసం రెండు మూడేళ్ళయినా పెద్దవాడై వుండాలి - కాని, తమ్ముడిలా కనిపిస్తాడు. అష్టలక్ష్మిల తండ్రి అయిన కావేరి అన్నగారికి (నూతన్ ప్రసాద్), ఎనిమిది తర్వాత కవలలు కలగటం, సిరోధ్‌రావుతో అయన సంభాషణ, హ్యూమర్‌గా భావించి పట్టున్నారు. విడాకుల చట్టాన్ని ఖండన జేయడం నుంచి హాస్యం జనించదు. కావేరి తన భర్త నుంచి డైవోర్సు కోరడానికి 'గ్రవుండ్స్' ఏమిటి? చాలస పరంగా అవి ఆమోదయోగ్యమా? వివాహ విచ్ఛేదం మంచిదికాదని ఒక బాలుడు కోర్టులో సుభాషితాలు చెప్ప నవసరం లేదు. అది అందరికీ తెలిసిన విషయమే! కాని, ఏ ఉపాయమూ లేక ఏ మార్గమూ లేక తమ గృహ జీవితం నరకప్రాయంగా తోచి, దాని నుంచి విముక్తి కావాలనీ, బయట పడాలనీ ఘట్టిగా అనుకొన్నప్పుడే కోర్టు కెక్కుతారు. పవిత్ర మెడలో పుస్తెలేకపోవడం అమ్మలక్కలు ఆక్షేపించడం దగ్గర నుంచి, కథ వంకర మార్గం పట్టింది. ఆ తర్వాత సన్నివేశాలన్నీ అసహజం గానే వున్నాయి. కళ్యాణ్ పాత్రకు వాస్తవ రూపమిచ్చాడు శరత్‌బాబు ; భర్తనిరాకృత లోకమంతటినీ సద్భావంతో చూడగలిగిన కావేరిగా సరిత, ఏది త్యాగమో ఏదిజీవనన్యాయమో తెలియని ద్వంద్వ ప్రవృత్తిలోపడే ధనిక యువతి పవిత్రలా జయసుధ, అమ్మాయి మనసెరిగిన అంకుల్‌గా గుమ్మడి ఈ చిత్రానికి స్పందన చేకూర్చారు. సంభాషణలు ([illegible]) బాగున్నాయి. నిర్మాత: రామలింగేశ్వరరావు. దర్శకుడు: అనిల్‌కుమార్.

## శ్రీ నికేతన్ వారి 'దేవాలయం'

"సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువమ్ - విశ్వం నారాయణం దేవమక్షరం పరమంపదమ్ ........ ఓం తద్బ్రహ్మ ఓం తద్వాయుః ఓం తదాత్మా ఓం తత్సత్యం- ఓం తత్సర్వం ఓం తత్పురోర్నమః - అంతశ్చరతి భూతేషు-గుహాయాం విశ్వమూర్తిషు - త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వం మిత్ర స్త్వగ్గిం రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మ త్వం ప్రజాపతి...."- అంటూ 'మంత్ర పుష్పం' తో క్రెడిట్ టైటిల్స్ ప్రారంభమవుతాయి. సుమారు అయిదువేల సంవత్సరాలుగా భారతీయ సంస్కృతిలో అంతర్భాగమై పోయిన ఈ సంస్కృత శ్లోకాల అర్థవివరణ యిక్కడ చెప్పదలచుకోలేదు. ఇది సినీ సమీక్ష. ఒకానొక దేవాలయం చుట్టూ పరిభ్రమిస్తుంది ఈ పిక్చర్. ఆ దేవాలయం శివాలయం. నటరాజుకి ప్రీతి పాత్రంగా గౌరి (విజయశాంతి) నాట్యారాధనతోను, పూజారి (సోమయాజులు) ధూపదీపనైవేద్యాలతో కూడిన అర్చనతోను కథాక్రమం పరిచయమవుతుంది. పూజారిగారి పెద్దకొడుకు ఓంకారం, తండ్రి అడుగుజాడలలో

వేయించి, జీససా, ఆదిశంకరుడా, మహాత్మాగాంధీయా ఎవరు ఏకాదశావతారమో యింకా తెలియడం లేదంటాడు. అక్రమ ద్వారాలన్నీ శంకరం మూసెయ్యడంతో, పశుపతి యితనిని ఆలయం నగల అపహరణ కేసులో యిరికిస్తాడు (శివాలయంలో నగలువుండవు - పార్వతీ అమ్మవారివేమో ననుకొనేందుకు ఆమె ప్రశక్తేలేదు.) పశుపతి ఉంపుడుకత్తె కళాపతి ఆనగలు పోలీసువారికి వొప్పగించి, శంకరాన్ని కాపాడుతుంది. జామునాపద్యాల స్మశాన వాటికలో, తన తండ్రి చితాభస్మమే శంకరం తననుదుట పూంచగా, గౌరి అతనికి భార్య అవుతుంది. ఈ సన్నివేశం చాలా గంభీరంగాను, గొప్పగాను వున్నది. అయితే, గౌరి దుర్మరణంతో అది చుస్సుమన్నట్లయింది. అలాగే, ఓంకారం చనిపోయినప్పుడు, ఇంటికేదో అరిష్టం పట్టిందని తల్లి అనడం, ఆ తర్వాత గౌరిమాటలవల్ల శంకరం తనదారి మార్చుకోవడముతో మూఢాచారాలతో కూడిన ఆస్తికత్వం కంటె, జిజ్ఞాస భరితమగు మానవత్వం గొప్పదని చెప్పబూనిన ప్రయత్నం కాస్తా తలకిందులయింది. రెండవ సగంలో దేవాలయంలో ఫైటింగుతో ఫార్ములాయే తప్ప రక్తిమ లోపించింది; వాస్తవికతకు మరీదూరమైపోయింది. ఈ మాదిరి ధర్మకర్త, యిటువంటి బ్రాహ్మణ్యం యిప్పుడెక్కడైనా వున్నారా? అస్వస్థుడై మంచం మీదున్న పూజారి, నాస్తికుడైన తన కొడుక్కి తన వృత్తి, మరొకడికి పోకుండా, కట్టబెట్టాలని చూడటం స్వార్థంకాదా? కరణీకం లాటిదే అర్చక వృత్తి కూడా! దానినంత మరీ గొప్ప చేయనవసరం లేదు. నిజానికి, ఆ పూజారిగారిలో కంటె దాసులో, (పియల్ నారాయణ) ఎక్కువ శివభక్తి కనిపిస్తుంది. ఆలయం మెట్ల మీద వదిలేసిన పసిపిల్లని పెంచి పెద్దజేసి చివరిదాకా రహస్యం కాపాడాడు. నటనలో ఫస్ట్ మార్కు నారాయణది. శోభన్‌బాబు యిలాటి పాత్రల్ని సునాయాసంగా వొప్పించగలడు - దశావతారాల దృశ్యం ఈ చిత్రానికి రసస్ఫూర్తి నిస్తున్నది. విస్మయిం గొలిపే నాట్యకౌశలం చూపించింది విజయశాంతి. మోదుకూరి జాన్సన్ పాటలు సూటిగా వాడిగా వున్నాయి. యువ దర్శకులు టి కృష్ణ, జనరంజని కోసం కొంత రాజీ పడ్డారా అనిపిస్తోంది. నిర్మాత : హరికృష్ణ.

## మకరజ్యోతి వారి
## 'రాధ - మాధవి'

రాజశేఖరంగారి కూతురు రాధ; తల్లీతండ్రీ లేని మేనగోడలు మాధవి; ఇద్దరూ ఒకే వయసువారు; ప్రేమలో పడటానికి సిద్ధంగా వున్నవారు. కాలేజీ క్లాసులు కట్ చేసి పొట్టదగ్గర ఎత్తుగా దోపట్టా పెట్టుకు, కృత్రిమ పురిటి నొప్పులు అభినయిస్తూ, రాజేశ్వరీలో నూన్‌షో ఫ్రీటిక్ట్‌కి, కక్కుర్తి పడటం ఆమె యడ్వెంచర్. మొదట ఒక పేద డ్రయివరూ, ఆ పైన ఒక భాగ్యవంతు

అబ్బాయి ఈ గేమ్‌లో పడతారు. ఆ డ్రయివరూ ఈ ధనికుడూ బాల్య స్నేహితులు. అంచేత, ఉష్ మంటూ పోయిన డ్రయివరు రాజా ఉద్యోగం, ఈ ధనిక నాగరాజు వల్ల చిటికలో వస్తుంది; అంతేకాదు, ఈ యువకులిద్దరూ తమ ప్రేమవిజయం కోసం స్థానాలు మార్చుకుంటారు. పెళ్ళి శుభలేఖలలో సైతం యిద్దరి పేర్లూ నాగరాజునే వేసుకుంటారు. ఇటు రాజశేఖరం, అటు చంద్రశేఖరం (వియ్యంకులు) అధిక ధనవంతులవడం వల్ల తమ పిల్లల ఆగడాలు చూసి ఆనందించడమేగాని వేరే పని వుండదు. డ్రయివరు రాజా గుడ్డిఅక్కగారిని చంద్రశేఖరం లోగడ వంచించి వున్నాడు-అంచేత, అతను విలన్. ఈ విలన్‌కి బుద్ధిచెప్పే ప్రకరణలో ఒక భాగంగా, రాజా తన భార్య రాధని మొదటి రాత్రి ఆదరించడు. తనకి శోభనం జరగలేదని తల్లికి చెప్పుకుంటుంది ఆ అమ్మాయి; అలాగే మాధవికీ నాగరాజుకి కూడా బల్లిపాటు కారణంగా ఫస్ట్‌నైట్ జరగదు. అంతేకాదు, కొన్నాళ్ళపాటు పాపపరిహారార్థం విడివిడిగా ఉండాలంటారు. రాధకి వేరే పెళ్ళిచేయాలని రాజశేఖరం అనుకోవడం, మామగారు తనని వొదిలించుకోవాలని యిచ్చిన పది లక్షలతోను మూడు ఇంపోర్టెడ్ కారులూ, పెద్ద బంగాళా కొని రాజశేఖరం ఇంటి పక్కనే ఈ డ్రయివర్ రాజా, చూపు వచ్చిన తన అక్కగారికి ఆశ్రయం కలిగించడం, తనదైన యింట్లో తన భార్య రాధతో ప్రథమ సమాగమం, యిలా కథాక్రమం విరసవిపత్తి రాడీలి క్లయిమాక్స్ దాకా సాగి, రాజశేఖరం కళ్ళుపోవడంతో ముగుస్తుంది. అంధ యువతిని అనుభవించడమే గాకుండా స్త్రీలోలుడైన కారణంగా ఆ శిక్ష.... అనేక చోట్ల ముతక హాస్యం చోటు చేసుకొంది ఈ కామెడీలో. ఉప్పు గాలి కెగిరిపోయే పాత్రలు. కామెడీ గనక కొంతమేర సరిపెట్టుకోవచ్చుగాని సైటింగులు అసందర్భంగా వున్నాయి. ఒక ఫ్రీలిఫ్టుకోసం, ఎక్స్‌హిబిషన్స్ కించపరుస్తూ, రాధలా ఎక్స్‌ప్లాయిట్ చేసే ఆడపిల్లలకు, రాజాలాంటి ప్రియుడెన్నటికీ దొరకడు. దారు తేలేసి మరొక చోటు.... నిర్మాత: వి. నాగేశ్వరరావు.

## స్వాహా వారి
## 'ఊరికి సోగ్గాడు'

కాలేజీ అబ్బాయిలు, కాలేజీ అమ్మాయిలతో, పరాచికాలాడే ఘట్టంతో ప్రారంభమైన ఈ చిత్రంలో తెలుగు లెక్చరరు (సాక్షి రంగారావు), 'మను చరిత్రం' చెబుతూండగా, 'అల్లసాని పెద్దన గనక అలా రాశాడు, పెద్దమ్మ అయితే మరొకవిధంగా రాసేది. ఆడపిల్ల ఆకర్షణకు లోబడని పురుషుడుంటాడా?' అని రాధ (విజయశాంతి) తన మొదటి ప్రయోగం ఆ లెక్చరర్ మీదనే చేస్తుంది; రెండో ప్రయోగం ఆంజనేయ భక్తుడైన బల్లకట్టు బాల రాజుపై చేసి, మీదపడి దొర్లించి అతనిలో స్వర్ణాజనితమగు చాంచల్యం

కలిగించి, యిదంతా ఏదో తమాషాకి, చేశానని తాతగారిని (రావుగోపాల రావు) నమ్మించబోతుంది. తలపండి పోయినా, మీసాలు మాత్రం బార్ల [illegible] తుమ్మెద రెక్కల్లాకాపాడు కుంటున్న ఆ తాతగారు, మనుమ రాలికి [illegible]నటిగా నిలబడతాడు. ముప్ఫ య్యేళ్ళ [illegible] 'రాండమ్ హార్వెస్ట్'ని తెలుగు [illegible] ప్రవేశించినా మర్చిపోయి [illegible] పోవటంతో, పదిహేనేళ్ళ క్రితం నాటి ప్రయాణంలో ఒక చిన్న పిల్ల [illegible] కాపాడే నిమిత్తం నీటిలోదూకి, ఆ అమ్మాయిని రక్షించి, తన జ్ఞాపకశక్తిని కోల్పోయిన రాజ శేఖరమే—ఒక కోటీశ్వరుని పుత్రుడు—ఈ బల్లకట్టు బాలరాజు. పందెం పోత రాజు (నూతన్‌ప్రసాద్), అంటే రాధని పెళ్ళాడాలనుకున్న విలన్ తన మను షులచేత బాలరాజుని కొట్టించి నీటిలో పడేయటంతో, అతనికి పూర్వ స్మృతి కలిగి, తిన్నగా తమ ఇంటికి వస్తాడు. గ్రామీణ సేవ చేసే డాక్టరు (జగ్గయ్య) అక్కడికి వచ్చి దుష్యంతుని కథ చెప్పి ఇన్నాళ్ళూ పెంచిన తల్లి (నిర్మల), మన సిచ్చిన రాధకి అన్యాయం చేయవద్దం టాడు. బాలరాజుకి వెంటనే వివేకో దయం కలిగి, రంగంలోకి దూకి తన బాహుబల విక్రమంతో దుష్ట శిక్షణ పరిపూరుస్తాడు.... బాలరాజుని అంత రెచ్చగొట్టి, తన తాతగారి మనసు సమ్మతింపచేస్తున్నప్పటికీ, కిందా మీదా పడి పోట్లాడుతున్నప్పుడు ఆమెలో కించిత్తు కూడా చలనం కలగలేదంటే ఆమె రాయి అయినా కావాలి, రాక్షసి అయినా కావాలి ఈ రెండూ కాదు; అంచేత, కథా గమనం కొంచెం దెబ్బ తింది.... విజయశాంతి, శోభన్‌బాబు డ్రీమ్ సీక్వెన్స్‌లో శృంగారం వొలక బోశారు; మనోవేదనని ఆమె, కార్య దీక్షని అతనూ చక్కగా కనబరిచారు. రావు గోపాలరావు పాత్రపోషణ గంభీ రంగా వుంది. సాహిత్యమూ సంభాష ణలూ బావున్నాయి. దర్శకత్వం: బి వి ప్రసాద్.

# రమణా వారి 'విషకన్య'

మాంత్రికుడు తన గురువుగారి శిరస్సుని ఒక్క వేటుతో ఖండించి, కపాలి కామినికి అర్పిస్తాడు. కామినీదేవి ఆ క్షుద్రదేవత. రాజపత్ని అయిన ఒక బ్రాహ్మణకన్య శిరస్సు కోరుతుంది. అందుకు 'సినిమా ట్రిక్ షాటు' వేస్తాడు మాంత్రికుడు. అప్పటికే ఇతనికి నాగకన్యపై (స్మిత) మోహం బలీయతరంగా వుంది; ఆమె తల్లిదండ్రుల (వారూ పాములే) అకాల మరణానికి ఇతనే కారకుడు. ఈ మాంత్రికుని మందిరంలో యిరువురు దేవకన్యలు నల్లశిలల మధ్య బంధింపబడి వున్నారు; భార్యకి తిండిపెట్టక మలమల మాడుస్తున్నాడు - అయితే, 'నీ యిష్టం వచ్చినప్పుడు బయటికి వెళ్ళిపోవచ్చు'నని, మాయా దుప్పటి మాత్రం ఒకటి యిచ్చాడు. మహా పతివ్రత భర్త మందిరాన్ని వొదిలి వెళ్లదు కదా! ఈ మాయా దుప్పటి, తన భర్త చెరబట్టిన నాగకన్య బంధ విముక్తికి ఉపయోగపడుతుంది .... గురుకులంలోని ఆచార్యవర్యుడు కరాటెతో బాటు పరకాయ ప్రవేశం కూడా నేర్పుతాడు - రాకుమారునికీ (శరత్ బాబు), మంత్రి కుమారునికీను (నరసింహరాజు). తోడుగా వున్న విలకశాస్త్రపు శకారునితో (నూతన్ ప్రసాద్), కోడి పుంజులుగా మారిన రాకుమార మంత్రి కుమారులు మళ్లీ మనుషులై, గుర్రాలు ఎక్కి, రాజధానికి వస్తుండగా, అపురూప సౌందర్యవతి కుంతల (అర్చన) తటస్థపడుతుంది. గారడీవానిగా, ఎర్ర చొక్కా వేసుకొన్న కోతిలా, రాజగురువులా మాంత్రికుడు, కామరూపాలు ధరించి, కుంతలా రాకుమారుల వివాహం జరిపించి, ఆమెను కపాల కామినికి బలియిచ్చేందుకు వివాహ వేదిక మీద నుంచి అపహరిస్తాడు. శరత్ బాబు (రాకుమారుడు) కుంతల నరసింహరాజు (మంత్రి కుమారుడు) స్మిత, అప్పటికే పెటల్ అయిపోయుంటు గనక, రాకుమారుడు విజయ సింహుని పుష్పంగా మార్చేసిన మాయామోహినీ (జయమాలిని), నాగకన్య (స్మిత) ప్రేక్షక రంజన కోసం ఫైటింగ్ జరుపుతారు. నాగకన్య నెగ్గుతుంది; పువ్వుం చేతబుచ్చుకు, ఆ పువ్వుని రాకుమారునిగా మార్చి, కర్తవ్య బోధ గావిస్తుంది .... ఇలా మంత్రతంత్రాలతో సాగి, చివరికి దుష్టులు శిక్షింపబడ, శిష్టులు రక్షింపబడి, శుభం పలుకుతారు .... మహాభారతంలోని జనమేజయుని సర్పయాగం, పాము అంటే మనిషికి ఎంత భయమో చెబుతుంది; జనమేజయుడి తర్వాత, రాజుల పేర్లే తప్ప, యిక గాథలేదు. నేటి ప్రపంచంలో 2500 జాతుల పాములు వున్నాయి; అందులో అయిదోవంతు మాత్రమే విషం కక్క గలవు: ఆ విషం కక్కగలిగే వాటిలో ప్రాణహాని చేయగలవి పదిపన్నెండు జాతులు మాత్రమే! అయితే, ఈ మధ్య పాములమీద వెలువడుతున్న

సాహిత్యం, సామాన్య పాఠకులని మరింత మౌఢ్యం వైపు మళ్ళిస్తున్నది. ఇప్పటికీ విద్యావంతులలో అనేకులు 'పాము పగబట్టడం' సర్వాబద్ధమంటే నమ్మలేరు. ఇక, సినిమా వారిని నాగరాజెప్పుడూ తప్పక కనికరిస్తూనే వున్నాడు. చతుర్దశ లోకాలనీ, అష్టాదశ పురాణాలనీ, త్రిమూర్తులనీ, ఇంద్రాదులనీ, కాపాలికులెవరో, తాంత్రికులెవరో, శాక్తేయులెవరో విశజనతో నిమిత్తం లేకుండా, ప్రముఖ తారాగణంతో, కామరూప వైవ్యాని ప్రదర్శిస్తే జానపద చిత్రమవుతుంది. పరకాయ ప్రవేశ మొక ప్రత్యేకాకర్షణ. అమృతం పంచడానికి విష్ణుమూర్తి మోహినీ అవతార మెత్తడమనేది పామరులకని ఉద్దేశింపబడ్డ పురాణ గాథ అని, ఈనాడు చెప్పి ప్రయోజనం లేని దుస్థితిలో వుంది మన సంస్కృతి ....రవితేజ దర్శకత్వంలో విజయబాపినీడు సమర్పిస్తున్న ఈ 'విషకన్య' మనీ-స్పిన్నర్ అవడంలో సందేహం లేదు. అందుకు తగిన హంగులన్నీ వున్నాయి. కథాగమనంలోని మలుపులు, విస్మయం గొలిపే సన్నివేశాలు, నారాయణరెడ్డి సుమధుర సాహిత్యం, చక్కని ఫోటోగ్రఫీ, నేర్పుగా అల్లిన అల్లిక, ఈ చిత్రానికి శోభనిస్తున్నాయి. ★



ఎవరెవరు ? ఏ చిత్రంలోనిది ఆ వేషధారణ ? సరిగా చెప్పగలిగిన మొదటి ఇరువురికీ పదేసి రూపాయిలు బహూకరించగలము. ఎక్కువ మంది చెప్పగలిగినప్పుడు చీట్లువేసి మొదటి ఇరువురికే బహుమతి ఇవ్వడం జరుగుతుంది. మీ జవాబు కార్డుమీదనే వ్రాయండి. మాకు అందవలసిన చివరితేదీ: 10-8-1985.

JAGATI - 2, Kutchery Road, P B 2922, Madras - 600 004

సీరియల్

# ఆనంది

## అన్నపూర్ణారెడ్డి

ఆనంది అత్తమామలు వైద్యం నిమిత్తం కేరళ వెళ్లారు. భర్త తరపు బంధువు మన్‌మోహన్ వచ్చి వారంరోజులయింది - అతనిపట్ల సదభిప్రాయం లేదు ఆమెకు. భర్త ప్రభాకరం, తను చెప్పేదేమిటో వినకుండా, విప్కారణంగా అనుమానపడి, యిష్టమొచ్చిన చోటికి వెళ్లిపొమ్మంటాడు. అవమానమూ రోషమూతో చంటిపిల్ల ప్రదీప్తితో రిక్షా ఎక్కుతుంది ఆనంది . . . ఇక చదవండి.

సూట్‌కేసులో తనకు, బేబికి సరిపడా బట్టలు అవసర వస్తువులు సర్దుకొని, "ఆల్‌రైట్ మీ ఇష్టమే కానివ్వండి!" అంటూ ప్రదీప్తని ఒడిలో పెట్టుకొని, హుందాగా వెళ్ళిపోయింది ఆనంది.

ముఖం చాటు చేసుకుండిపోయాడు ప్రభాకర్.

* * *

రాత్రి పదిగంటలవేళ, తలుపు టకటకలాడితే వెళ్ళి, తలుపు తీసింది వైదేహి.

మసక వెలుతురులో నుంచున్న ఆనందిని గుర్తుపట్టి సంతోషంతో "ఏయ్, ఆనందీ - ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు . . .రా. . . ఒక దానివే వచ్చావే శ్రీవారు రాలేదా...' ప్రశ్నల వర్షం కురిపిస్తూనే సూట్‌కేస్ అందుకొంటూ, లోనికి దారి తీసింది వైదేహి.

భుజంమీద నిద్రపోతున్న ప్రదీప్తిని మంచంమీద పడుకోపెట్టి, నిస్త్రాణగా కుర్చీలో కూలబడింది ఆనంది. గుంటలుపడి పీక్కుపోయిన ముఖంతో అలసిపోయినట్టున్న ఆనందిని చూచి 'ఏమిటే అలా వున్నావు? ప్రయాణం సాఫీగా సాగిందా? ఆరోగ్యం సరిగా లేదా?' అంటూ ఆత్రుతగా మీద చేయివేసింది వైదేహి.

"వైదేహీ!.. నీవడిగిన ప్రశ్నలకు అన్నింటికీ మరొకసారి బదులిస్తాను. కాని నాకు కాసిని మంచినీళ్ళివ్వు. బాత్‌రూమ్ ఎక్కడ వుందో చూపు - కాళ్లుచేతులు కడుక్కొని వస్తాను" అంది ఆనంది.

టవల్‌తో ముఖం తుడుచుకొంటూ వచ్చేసరికి కంచంలో కొన్ని అన్నం మజ్జిగ వడ్డించి, 'తిను' అంటూ ముందుకు తోసింది వైదేహి.

ఉదయంనుండీ ఏమీ తినలేదు. మనసంతా భయంకరమైన సంక్షోభంతో నిండిపోయివుంది. అనునయంగా మాట్లాడితే భోరున ఏడ్చేసేలా వుంది పరిస్థితి.

మజ్జిగా అన్నం తిని కాసిని నీళ్లు త్రాగి, 'ఓ బాప వుంటే ఈలా

పడేయ్! కళ్లు మూరుకు పోతున్నాయి' అంది ఆవలిస్తూ ఆనంది.

మడత మంచం వాల్చి 'నీవు పెద్ద మంచంలో పడుకో.. నాకిది చాలు' అంటూ లైటార్పేసింది వైదేహి.

ఇంకా చీకట్లావరించే వున్నాయి; శ్రీ వెంకటేశ్వర సుప్రభాతం ఖంగున విన్పిస్తూంది. ప్రక్కలో కూర్చున్న వైదేహి, "ఆనందీ!" పిల్చింది.

'ఊ!'

'నిద్ర వస్తోందని పడుకొని దాదాపు రాత్రంతా జాగరణ చేశావు.... ఆరోగ్యం బాగోలేదా?.. రేపు 'రూయా' హాస్పిటల్‌కి వెళ్దామా' అంది అనునయంగా.

చాలాసేపు మౌనంగా వుండి పోయింది ఆనంది. తరువాత నెమ్మదిగా తనకు ఎదురైన సమస్య వివరించి చెప్పింది వైదేహి'.. "ఈస్థితిలో నేనేం చేయాలి? అమ్మా నాన్నల దగ్గరకు వెళ్ళి వుండలేను - చేయని నేరాన్ని మోస్తూ! అసలు అత్తయ్య వాళ్ళ ఇంట వుండివున్నట్టయితే, ఈ సమస్యలు తల ఎత్తేవే కావు. కొంత కాలం దూరంగా వుంటే, అతడే ఒకనాటికి తెలుసుకోగలడని ఈలా ధైర్యం చేసి వచ్చేశాను."

పాలవాడు పాలసీసా గుమ్మంలో వుంచిన అలికిడికి చెప్పటం ఆపు చేసింది ఆనంది.

"అబ్బే, ఈ రోజునుండీ ఇంకోసీసా అదనంగా ఇవ్వు" పురమాయించింది వైదేహి.

తూర్పు తెలవారింది.

"ఆనందీ, నీవు మంచిపనే చేశావు. జీవితంలో ఎదురయ్యే సమస్యలను కొంత ధైర్యంతో ఎదుర్కొని ఎవరికి వారు పరిష్కరించుకొంటేనే మంచిది. స్నేహితురాలిగా నిన్ను హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను. కానీ ఇక్కడ వుండాలంటే మాత్రం ఒక షరతు."

ఏమిటన్నట్టు కళ్ళెత్తి చూచింది.

తనవీపు నానుకొని కూర్చునివున్న వైదేహి కళ్లు నవ్వుతున్నాయి.

'కృంగిపోతూ కాకుండా బ్రతకడం నేర్చుకోవాలి!' గంభీరంగా వెలువడ్డాయి మాటలు.

స్నేహితురాలిచేయి అప్యాయంగా నొక్కింది ఆనంది.

తెలుగు ఎమ్.ఎ. చదివిన వైదేహి, అక్కడ కళాశాలలో తెలుగు అధ్యాపకురాలు. ప్రేమించిన ప్రవీణ్‌కుమార్ ఒకప్పుడు మదనపల్లెలో పెద్ద లాయర్. కాని నక్సలిజమ్‌పట్ల అతడు మొగ్గు చూపి హత్యాకాండలో చేయి కలిపాడన్న నేరం మీద, జైలుపాలు కావడంతో, వైదేహి అవివాహితురాలుగా వుండిపోయింది.

ఆ ఉదయం నుండీ వంట ఇంటి బాధ్యత ఆనంది తీసుకొంది. వద్దని వారిస్తే, నాకు తోచేదెట్లా? - అని కొట్టిపారేసింది.

ఎంతపనిలో వున్నా, పరాకూ ఆలోచనాభారంతో కొట్టుకుపోయే ఆనంది ఏదైనా వ్యాపకం వుంటే తప్ప, కోలుకొనే సూచన లేదని, ఓ ట్యుటోరియల్ కాలేజీలో తనకు తెలిసిన

వారి ద్వారా పార్ట్‌టైమ్ టీచింగ్‌పోస్ట్ చూపిపెట్టింది వైదేహి.

దగ్గరలోనే వున్న 'క్రష్' లో పాపను వదిలేసి, ట్యుటోరియల్ కాలేజీకి వెళ్ళివచ్చేది ఆనంది.

రాత్రుల్లో స్నేహితురాళ్ళిద్దరూ బేబీ ముద్దుమాటలు వింటూ, తమ కాలేజీరోజులు, కుటుంబ విషయాలు తులు మున్నగు సంగతులు మాట్లాడుతూ గడిపేవారు.

o o o

'ప్రభాకర్ గారిల్లిదేనా?'

ఉదయం ఎనిమిది గంటలైనా, ఇంకా నిద్రమత్తులో జోగుతూ పగటి కలలు కంటున్న ప్రభాకర్‌కు చప్పున నిద్రతేలిపోయింది. ఇంత పెందలాడే తన ఇలు వెతుక్కుంటూ వచ్చిన పెద్దమనిషి ఎవరై వుంటారు?.... కొంపతీసి . తన మామగారు కాదు కదా? ఒక్కసారి భయంలాంటిదేదో కలిగింది.

సిగరెట్ అంటించుకొని స్లిప్పర్స్ తొడుక్కొని భంగున లేచి నుంచు న్నాడు.

కాలేజి రోజుల్లో సిగరెట్లు కాల్చే వాడు ప్రభాకర్. పెళ్ళయ్యాక ఆనంది మాటకు కట్టుబడి పూర్తిగా మర్చి పోయాడు అది తెలిసిన స్నేహితులు 'ఒరేయ్! నీవు భార్యా విధేయుడు రోయ్' అని వేళాకోళం చేసినా ఐ కక్ ఇట్ యాజ్ ఎ కాంప్లిమెంట్!' అంటూ చిరునవ్వుతో జవాబిచ్చేవాడు.

ఆనంది వెళ్ళిపోయాక ఆనంది మీద 'రివెంజ్' కోసం కానీ, మరొకటి కానీ, ఛైన్ స్మోకింగ్ మొదలెట్టాడు. రాత్రి కాల్చిపారేసిన పీకలు మంచం ప్రక్కన కుప్పగా పడివున్నాయి. అన్నీ కాలితో ఓమూలకు తోసి, షర్ట్ తగిలించుకొని, కాలర్ సర్దు కొంటూ 'రానియ్! మామగారైతేనేం, బావమరిది అయితేనేం, బుద్ధి చెప్పి మరీ పంపిస్తాను' అనుకొంటూ వరండాలోకి వచ్చాడు.

తీరా వరండాలోనుంచున్న యువతీ యువకులను చూచి సిగరెట్ నేలమీద జారవిడిచి, స్లిప్పర్‌తో తొక్కి, క్షణ కాలం అలాగే నిలబడిపోయాడు.

ఆ ఆగంతకుడు, ముఖం నిండా, నవ్వు పులుముకొని 'ప్రభూ! నేను రా బాబూ - మౌళిని....'

మాసినగడ్డం, నలిగిన పేంటూ షర్టూ, పీక్కుపోయిన దవడలుచి బట్టతల యువకుణ్ణి పరకాయించు చూచి 'ఓరి, ఓరి నీవ్రా - గు లేకేం, రండి!' లోపలికి ఆహ్వా నించాడు ప్రభు.

భుజాలచుట్టూ పమిటను మరింత గా బిగించుకొని చేతిలో జిప్ బేగ్‌ను మరో చేతిలోనికి మార్చు కొంది అమ్మాయి.

"రా!.... కళా ..." అంటూ గోడ వార వుంచిన బ్రీఫ్‌కేసు అందుకొని లోనికి నడిచాడు మౌళి.

హాల్లో దుమ్ముకొట్టుకుపోయిన సోఫాలో కూర్చోపోతూ, "ఈ

అమ్మాయి నా సిస్టర్ కళావతి....'' అని ఇతను ప్రభాకర్, నా బెస్ట్‌ఫ్రెండ్'' అని పరస్పరం పరిచయం చేశాడు.

హాఫ్ వాయిల్‌వీర, రవికెలో ఇరవైఏళ్ళ వయసున్న అమ్మాయి రెండు చేతులూ జోడించింది. వొంకుల జుట్టు దుబ్బుగా రేగివుంది. తెల్లటి దేహచ్ఛాయ - చూడగానే ఆకట్టుకొనే కనుముక్కుతీరు. కూర్చోండి- అంటూ కుర్చీ చూపించాడు ప్రభాకర్.

జోసిపోయినట్టున్న ఇల్లు కలియ చూచి 'చెల్లాయి ఏది? - అమ్మ నాన్న నీ దగ్గిర లేరా?' అక్కరగా ప్రశ్నించాడు మౌళి.

''ట్రీట్‌మెంట్ కోసం అమ్మను తీసుకొని నాన్నగారు కొట్టాయం వెళ్ళారు. ఆవిడగారు వాళ్ళఊరెళ్లింది ఈమధ్యే''.

"దరిద్రుడు తలగడగబోతే వడగండ్లవాన - అన్నారు పెద్దలు ఇదే కాబోలు." ఎడమ అరచేత్తో గడ్డాన్ని రుద్దుకొన్నాడు మౌళి.

"ఏమైందిరా చాలా నిరాశగా మాట్లాడుతున్నావు? రెట్టించాడు ప్రభు. ఎంతో ఆశతో వచ్చాను బాడ్‌లక్ స్వగతం అనుకున్నట్టే పైకి అనేశాడు. కళ్ళలో నిరాశ ప్రస్ఫుటమైంది.

"ఏమిట్రా బాడ్‌లక్ అంటున్నావు ఏం జరిగిందేమిటి?''

"ప్చ్! నా జాతకమే అలాగుందిరా! ఇప్పుడు చూడు ఎంతో ఆశతో వచ్చాము. సిస్టర్‌ను మీ ఇంట్లో కొంత కాలం దిగవిడిచి, ఉద్యోగాన్వేషణకు వెళ్లాలని.... ....

(ఇంకా వుంది

# పసిడి పలుకులు

రహస్యాన్ని చిన్నపిల్లలు, పెద్దల కంటే భద్రంగా వుంచగలుగుతారు.

స్త్రీల చేతులలోని ఆ మృదుత్వం పసివారిని లాలించి బుజ్జగించి జోకొట్టేందుకు.

టెలిస్కోప్ ఎక్కడైతే ముగుస్తుందో, మైక్రోస్కోప్ అక్కడనుంచి ప్రారంభమవుతుంది. రెండూ విస్మయ జనకములే!

దేవత అనే మాటని ఏ భాషనుంచీ తప్పించలేరు. ఆ మాటలో హృదయ రాగం ఉంది: ప్రేమదీపం ఉంది.

మానవాత్మ భ్రమరం వంటిది ఒక పువ్వు నుంచి మరొక పువ్వు మీదకి వాలుతూంటుంది - జీవనమకరందం కోసం.

దౌర్భాగ్యుల దుర్భర వేదనలోని జాలికరమగు వెలుగు, దివ్యకాంతిలా ప్రకాశిస్తుంది.

ఈ లోకంలోని మహదానందం మనం ప్రేమింపబడుతున్నామనే మనో విశ్వాసం నుంచి జనిస్తోంది.

ఆటబొమ్మ పసితనంలో ఎంతో అవసరమనిపిస్తుంది-ఆడపిల్లల పెరుగుదలలో బొమ్మలాట ప్రధానాంశం.

ఈ పంధొమ్మిదో శతాబ్ధిలో మూడు సమస్యలు కొట్టొచ్చినట్టు కనిపిస్తున్నాయి. దారిద్ర్యం వల్ల పురుషుల పతనం, ఆకలివల్ల అతివల నాశనం, నైతిక విలువల లేమివల్ల బాల్యమనేది మృగ్య మవటం!

—విక్టర్ హ్యూగో






---

JAGATI Telugu Monthly - Vol. 30 No. 349 - Aug. 85

Edited, Printed and Published by N. R. Chendur at

MANASA PRESS, 2 - Kutchery Road, Madras-600 004

Phone : 76697